# SARANGADHARA.

**A Drama in 7 Acts.**

BY

**VISHNUBHATLA**

**SUBRAHMANYESWARA SASTRI**

*ASTAVADHANI.*

---

ప్రకాశకులు :-

కానంశెట్టి శేషగిరిరావు అండ్ బ్రదర్సు,

ఏలూరు.

2000 ప్రతులు.

రామా ముద్రాక్షరశాల, ఏలూరు.

---

 1922. [వెల 0-12-0

# ప్రకటన

## శ్రీవైష్ణవ విశిష్టాద్వైత సిద్ధాంత సారసంగ్రహ ప్రశ్నోత్తరమాలిక.

ఈ సద్గ్రంథము చాలాకాలము క్రిందట మ. రా. శ్రీ రాళ్ళపల్లి కొండలరాయుడుగారిచే నాంధ్రీకరింపఁబడియె. ఇట్టి గ్రంథము యిప్పుడెచటను గానరాకున్నది. గాన మీరెట్లయిన దానిని సంపాదించి యచ్చొత్తింపవలసినదని నా మిత్రులు ప్రోత్సాహపరచినందున సదరు గ్రంథకర్తలెవరో తెలియక జాల శ్రమపడి తుదకెట్లో భగవత్సంకల్పమున వారి సోదరులగు మ. రా. శ్రీ రాళ్ళపల్లి నాగభూషణంగారివలన నీసద్గ్రంథముయొక్క వారసత్వపు హక్కును, కాపీరైటు హక్కును 14-3-1915 తేదీనిపొంది యచ్చొత్తించితిని. ఇది శ్రీవైష్ణవులకేగాక రామానుజ మతావలంబకులకెల్ల ముఖ్యమైన గ్రంథము. మంచిముద్రణము. కొన్నిప్రతులు మాత్రమే గలవు.

వెల 0—6—0.

సిరా:—ఇంక అనేకములగు గ్రంథములు గలవు.

వలయువారు:—

**కొసంశెట్టి శేషగిరిరావు అండు బ్రదర్సు,**

బుక్ సెల్లర్సు, ఏలూరు—కృష్ణాజిల్లా.

శ్రీ ర స్తు.

# సారంగధర నాటకము.

విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వర విరచితము. 



పబ్లిషరు:

కొసంశెట్టి శేషగిరిరావు బ్రదరు

ఏలూరు, కృష్ణాజిల్లా.

7 వ కూర్పు 1000 ప్రతులు.

ఏలూరు

రామా ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1922.

---

 [వెల అ 12 లు.

# పీఠిక.



నేను హేలాపురిలో నివసించునపుడు బెజవాడ హిందూనాటక సమాజము వారచ్చటికి వచ్చి కొన్ని రూపకంబులం బ్రదర్శించిరి. అత్తరి నా బాల్యమునుండి నామిత్రులగు బ్రహ్మశ్రీ మల్లాది అచ్యుతరామశాస్త్రిగారివలన నా నాటక సమాజాధ్యక్షులయిన మ॥ రా॥ శ్రీ కాశీనాధుని వీరమల్లయ్యపంతులుగారికి నాకును బరిచయము కలిగినది. ఒక్కనాఁడు పంతులు గారు సారంగధర నాటకము వ్రాయవలసినదని నాతోఁ బ్రస్తావించినారు. మిత్రాభీష్టంబు నెరవేర్చుటకన్న నన్యంబగు కార్యంబేమి యని నా యసమర్థతయైనఁ దలఁపక వ్రాయఁదొడంగి తగు కాలంబులోనే పరిసమాప్తి నొందించితి. పిదప నాగ్రంథంబును శాంతంబుగాఁ జదివి కరుణరసంబువలెనే శృంగార రసంబునుగూడ విశేషంబుగా వ్రాయవలసినదని నాప్రాణమిత్రులయిన చుండూరి శ్రీరాములుగారు ప్రోత్సాహపఱచుటచేత నదియును నాశక్తివంచనలేక వ్రాసితిని. ఈ నాటక రచనమునకుఁ గారకులయిన వీరమల్లయ్యపంతులుగారికిఁ జుండూరి శ్రీరాములు గారికి సదా కృతజ్ఞుఁడను. ఈనాటకంబును బెజవాడ నాటకసమాజమువారనేకపత్తనంబులందు బహువారంబులు ప్రదర్శించిరి. అప్పుడా ప్రదర్శనంబుల వీక్షించిన విచక్షణులందఱు మందానందహృదయారవిందు లగుటచేతను నా శ్రేయోభిలాషులగు శత… నులు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర విద్వత్కవులు సరసాభిప్రాయము దయచేయుటచేతను గ్రంథ మచ్చొత్తించితిని. గుణదోషంబులు మనీషులకే యెఱుక. ఆర్యులు నాయందు శిష్యప్రశిష్య వాత్సల్యంబుఁ జూపఁ బ్రార్థితులు.

1—5—17 
బెజవాడ.

ఇట్లు విధేయుఁడు,
విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వరము.

శ్రీహ్మ్రజ్ఞానికి రాజమాంబకును గారాబంపుఁబుత్రుండు ను
బ్రహ్మణ్యేశ్వర నామధేయుఁ డొగి నీగ్రంథంబు నిర్మించెఁదాన్.

నటి—ఆనాటక మాడుటవలన నీసభాసదులు సంతసింతురా!

సూత్ర—సంతసింపకేమిగాని యొక్కటిమాత్రమున్నది. మనము తగినంత జాగరూకతగలిగి ప్రదర్శింపవలయును.

గీ. నాటకగ్రంథములచేత నటులు నటుల । చేత నాటకగ్రంథముల్ ఖ్యాతి గాంచ
నగును మణులచేతనగలు నగలచేత । మణులు కిరణప్రకాశించుమాడ్కి మగువ.

నటి—మనప్రదర్శకుల నైపుణ్యంబు నెఱింగియు మీ కాసందేహ మెందులకు?

గీ. కప్పువడినబంగరునకు గాంతినిచ్చు । పటికచందానమూలలఁ బాతుకొన్న
రూపకములకు మననటుల్ రూపుదెత్తు । రౌర! కావున వగవంగనగు నెమీకు.

సూత్ర—పండితులెల్లఁ దలలూపునుక ప్రగల్భులవంకకుఁ గన్నయిన నెత్తకుము. మనశిరంబుమీఁదఁ గార్యభారముండుటచేత నమ్రత నొందవలయును. ఎందుచేతనన,

ఆ. లేనివానికొక్క లేనిచింతయెయుండఁ గార్యధూర్వహునకుఁ గలవు వేలు
తిటిపెగానికొక్క తిండిచింతయెయుండ; భూధవునకునుండుఁ బుట్టెడేని.

(తెఱలో)

గీ. తిటిపెగానికొక్క తిండిచింతయెయుండ; భూధవునకునుండుఁ బుట్టెడేని
గొడ్డురాలికొక్క బిడ్డచింతయెయుండ నిఁక సపత్యవతికి నెన్నొయుండు

నటి—ఆర్యా! యెవరో కాని మనయుపమానం బుపమేయంబుగాఁ గొనిపలుకుచున్నారు. అదిమనల నపహసించుట కాదుగదా.

సూత్ర—ఎంతవెఱ్ఱిదానవు అట్లుకాదు. రాజరాజనరేంద్రుఁడు తన రాజ్యభారంబు సకల సత్కళాదురంధరుండగు సారంగధరున కొసఁగఁ దలఁచినాఁడని నిన్న మనము వినియుంటిమిగదా! నేఁడు సారంగధరుఁడు తండ్రి రాకమున్నె సభాభవనంబునకుఁ దన నెచ్చెలియయిన సుబుద్ధితోవచ్చి రాజ్యభారంబు కష్టంబని చెప్పుచున్నాఁడు. కావున మన మిచ్చటనుండుట సమంజసము కాదు. పోదము (అని నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

---

# సారంగధర నాటకము.

## ప్రథమాంకము.

### సభాభవనము.

(సుబుద్ధితో సారంగధరుఁడు ప్రవేశించును.)

సారం—

ఆ. తిరిపెగానికొక్క తిండిచింతయెయుండ । భూధవునకునుండుఁ బుట్టెడేని
గొడ్డురాలికొక్క బిడ్డచింతయెయుండ । నిఁక నపత్యవతికి నెన్నొయుండు.

ఏదయిన నొక్కపనిఁ బూనుట స్వేచ్ఛాభంగముగాని వేఱొండు కాదు. అందును ఱేఁడైన శిష్టుల రక్షింపవలయును. దుష్టుల శిక్షింపవలయును. రాజులకు శ్రోత్రములే నేత్రములగుటచే శిష్టదుష్టవిమర్శనం బెట్లు స్పష్టమగును? ఎక్కడనో వివాదంబు జరిగి పరిష్కారంబునకు వచ్చినప్పుడు న్యాయాన్యాయంబులను జక్కగా యోజించి మఱి చెప్పవలయును. లేనిచో నాపాపంబు వసుంధరాధవునిదే. కాఁబట్టియే "రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మని పెద్దలు శాసించిరి.

సుబు—ఏమి రాజకుమారా! రాజ్యభార నిర్వహణంబునకు విచార మొందుచున్నాఁడవు. ఈ త్రిలింగదేశంబు నిరంకుశాధికారంబుగాఁ బరిపాలింపుచు సమస్తభోగంబుల నొందుటకన్న నింక నధికంబగు నదృష్టమున్నదా? రాజ్యభారంబును వహించిన పిదప నీవెందఱి కెన్నివిధంబుల నక్కఱకువత్తువో కదా!

సారం—అందఱి కక్కఱకువత్తునా? ఒకవేళవచ్చిన మఱింతబాధనుమీ.

గీ. అక్కఱకువచ్చువానికే హానివచ్చు । నక్కఱకురానివాని కేహానిలేదు
పాలొసఁగు నావునకు బంధబాధగాని, లేనియావునకే బాధ లేదుగాదె.

(తెలిసి)

కుమారా! లెస్సఁగాఁ బల్కితివి. చిరంజీవి వగుదువుగాక.

సారం—మిత్రమా! నాపలుకునకలరి యేకగ్రీవముగా నీ జనకుండును, నా జనకుండును, గురుండగు నన్నయభట్టును బలపఱచుచు నాశీర్వాదంబు సేయనున్నారు. వారికి నెదురుగఁబోవుదము. (అట్లుచేయఁ బిమ్మట నన్నయభట్టుకు ధీమంతులతోడ రాజరాజనరేంద్రుఁడు ప్రవేశించును.)

సారం-సుబు—గురులారా! వందనములు.

రాజ-ధీమం-నన్న—కుమారులారా! కళ్యాణమగుఁగాక!

రాజ—సభ్యులారా! ఘూర్జరాధిపుఁడు నిన్ననొక వార్తాహరునిఁ గొన్నిప్రశ్నంబు లిచ్చి వానికి సదుత్తరంబుల నిమ్మని మనకడకంపె. అవియేవియన, అన్నిఁటిలో హేయమేది? అయుక్తమేది? ఎవరిని నమ్మఁగూడదు? జీవికి నీతియేది? ఈ ప్రశ్నంబులకు మీరందఱు సమాధానంబులఁ జెప్పుఁడు.

ధీమం—ఈ ప్రశ్నంబులకు సమాధానమిచ్చుట నాయట్టివానికి దుస్తరము. అయినను నాకుఁ దోఁచినభంగి మొదటిప్రశ్నంబున కుత్తరం బిచ్చెద.

ఉ. ఈడునుజోడునై తనరు నింతిని బెండిలియాడక కెందు బ్రే
లాడు చెవుల్గలాఁడు నదు యౌవనమందలి చేడెఁగూడినన్
గీడగు చేతఁజేత నపకీర్తినిదెచ్చు గృహంబునందెవో
మూడఁగఁజేయజాచు తనుముట్టదు పోకురుమంచు రోయుచున్.

ముదుకండు తరుణంబులోనున్న తరుణిఁ జేకొనుటకన్న హేవకే హేదు.

సారం—కోవిదులు గుణగ్రాహులు. కావున నా యసమర్థతనైనఁ దలఁపక రెండవ ప్రశ్నంబునకు నాబుద్ధికిఁ దోఁచినట్లు మనవిచేసెద చిత్తగింపుఁడు.

చ. బలిమిని దన్నుఁ గూడినను బాధలు పెట్టిన భర్తతో నృపల్
వలికిన గోడు రోమకునఁ బాతిపదంబులఁ దుల్లిపఁ బంపినన్
గలనయినం జనుండు పరకాంతలఁ బొందగరాదు వారికీ
యిల దలవంపుఁ బల్కుల నొకింతయు సాదఁగ రాదొకప్పుడున్.

సుబు—ఆర్యులు నాకుఁగఱపినకైవడి మూఁడవ బ్రశ్నంబునకు నుత్తరం బిడు వన్ను మన్నింపుఁడు.

ఉ. దైవము నీవటంచుఁ బతిదాపున దబ్బరలాడి వే నతం
డావల బోమఁదిప్పఁగ గృహంబు తొలంగ నటంచు నన్యునిన్
వావిని వీడి కోఁడితన వాంఛను దీర్పకయున్నఁ గిన్కచే
నెవియొ భర్తతోఁ బలుకు నింతుల నమ్మఁగరా దొకప్పుడున్.

నన్న—నాకుఁ దెలిసినంతలో నాలవప్రశ్నంబునకు నుత్తరంబిడెద.

ఉ. తప్పుగలట్టిమానవులు తప్పు లెఱుంగనివారిభంగి నే
తప్పును లేనిమానవులు తప్పు లెఱింగినవారిభంగి నౌ

రాజ—మీరు చెప్పినవి సదుత్తరంబులయి నాచిత్తంబును సంతోషాయత్తంబును జేసినవి. సచివాగ్రణీ! యీయుత్తరంబులు వ్రాసి వార్తాహరునిఁ బంపుము.

ధీమం—చిత్తము.

(తెరలోఁ గలవరము)

రాజ—ఎవఁడురా యక్కడ? ఆకోలాహలం బేదియో కనుగొనిరమ్ము.

సేవ—(ప్రవేశించి) మహాప్రభూ! మృగంబులచేత వంతలనొంది వ్యాధులు వచ్చియున్నారు.

రాజ—వారిని నిరాతంకముగా లోనికి రానిమ్ము.

సేవ—మహాప్రసాదము (నిష్క్రమించి వ్యాధులతోఁ బ్రవేశించును)

ఎల్లి—మహాప్రభూ! మీ పాదాలకు దండాలు. ఇంక మాకీపుడమిపై ఋణము లేదు. మంచికాలమంతయు మంట గలిసినది. (పుల్లిగాని వంకజూచి) ఓరీపుల్లిగా! బావా! సామివారితో మనకష్టాలు మనవిచేసికొనవేమి? మనల కాచువా రెవ్వరు? సాకువా రెవ్వరు?

రాజ—వ్యాధులారా! వగపన్న పెట్టిదియో మున్నెన్నఁడు కలలోనైన నెఱుంగని మీరిట్లు వగవనేమికతము? క్రూరసత్త్వబాధ లేమయిన హెచ్చెనా? పంటలు పండకపోయెనా? మీపిల్లలకుఁ బసువులకుఁ గుశలంబే కదా?

పుల్లి—మీయనుగ్రహంబునఁ బాడిపంటల కేమిలోపములేదు. దొంగలబాధ లంతకుమున్నే లేవు కాని నేఁటికాలంబునకు యాదవకులంబునకు ముసలంబు పుట్టినట్లు మాచావునకుఁ బాడుమెకములు దాపరించినవి. వాని గ్లానిచే వాలికి మగడు మగని వాలియుఁ దల్లిదండ్రులకుఁ బిల్లలుఁ బిల్లలకుఁ దల్లిదండ్రులును గాకుండ నున్నారము. వీనిమూలాన మాకొంపలు విడిచిపెట్టి పొట్టఁ జేతఁబుచ్చుకొని తల దాఁచుకొనుట కే కాని దేశమునకో వెళ్ళుగతి పట్టినది బాబూ! ఏమిచెప్పినను నమ్మెదరు. బిల్లలు గలవాడను. మీపాదాలుసాక్షి పొట్టనిండఁ గూడు కంటినిండ నిద్రలేక రాములవారి తమ్మునిఁ దలఁచుకొనుచు నానాఁటి సీతమ్మవారి కష్టాలు పడుచున్నాము. చూచి తీరవలయును. చెప్పుకొన్నఁదీరదు అక్కఱలేని పత్తులము. మీరే రక్షింపవలయును. మాపాలిటి దేవుడు మీరే.

రాజ—శివశివా! ఎంతమాట విననయ్యెను. పులిందులారా! మీ డెందంబులఁ గొందల మొందకుఁడు. బెగడిల్లకుఁడు. మున్ను దేవతలంతవారు రక్కసులచేతఁ జిక్కు

చిక్కులఁ గాంచినారు. మీకడగండ్లల్పకాలములోనే నశించును. చీఁకటిరాత్రి యెప్పుడుండునా? అమాత్యచూడామణీ! అంతమాత్రి మాపదకు వీరిట్లు వగవరు.

నల్లి—బాబూ! ఇంకొకమనవి.

ఆ. ఎల్లిగాఁడితల్లి యెఱుఁగున కెరయయ్యెఁ। బుల్లిగాఁడిబిడ్డ పులికి నయ్యె
వీరికేమిగాని పెద్దసింగమ్ము నా । యింటిదానిమ్రింగె నేమిచెప్ప.

పుల్లి—ఎన్ని కంతులు కోసినను నాకంటియంత నొప్పి లేదన్నట్లు చెప్పితివి. దొరగారూ! నాకష్టముముందర వీనికష్టమునకెంత.

గీ. జగతిలోపలఁ బెండ్లాము చచ్చెనేని? । దానియమ్మను మరియొక్కదానిఁగాంచ
వచ్చుఁగాని కన్నకొడుకు చచ్చెనేని । మరల వాఁడెట్లు దొరకును మానవేంద్ర.

నల్లి—ఓరి మూఢులారా! వచ్చినపనివిఁ జెప్పక మీలోమీరు పోట్లాడి చచ్చెదరేమి? మహాప్రభూ!

గీ. కడుపులోఁ జల్లకదల లేకాలమందు । బ్రతుకు మాకు విపత్తులు ప్రాప్తమయ్యె

రాజ—నక్కటా మీఁదలిదుమల నదల నేల । గొడుగుచాటువారు జడికి జడియనేల?

పుల్ల—మీరువచ్చినగాని మృగములు చావవు; అవి చచ్చినఁ గాని మాకు బ్రతుకుతెరవులేదు. మీబిడ్డలము. తీగకుఁ గాయబరువా?

రాజ—శబరులారా!

చ. అరయఁగ నింతమాత్రమున కాత్మను సాధ్వసమొంది యిట్టిమీ
పరివసథంబులన్విడిచి వంతలఁ బొందఁగనేల పొందు స
త్వరగతి వచ్చి భీషణకృపాణముచేత క్షణంబులోపలన్
గరిహరి కోలభల్లముఖ కానన దుష్టమృగాళిఁ జంపెదన్.

ఎల్లి—బాబయ్యా! నాదియొక్క మనవి,

గీ. హాలహలబృహద్భానునధిక భయముఁ । బాపి యాదితేయులఁ గన్నధగుణిభంగి
క్రూరమృగబాధలనుబాపి కూర్మితోడ । నమ్మ బిడ్డలచందాన మనుపుమయ్య.

రాజ—మీకేల యిక్కరణి నొక్కి వక్కాణింపవలదను. గ్రక్కునవచ్చి యామెకంబులఁ జక్కాడెద. మంత్రివరా! అరణ్యంబున కవశ్యంబుగా నరిగి యందలి దుష్టసత్త్వంబుల పదమదంబు జేసెద. ఆచ్ఛాదనవ్యాపార పారీణులగు మృగయులను మారుతవేగంబులగు జాగిలంబులను వలయు నుపకరణంబులను సిద్ధపఱచునట్లు చేయుము.

ధీమం—చిత్తము అట్లొనరించెదను. (అని నిష్క్రమించును)

ఎల్లి—ఓరి బావా! స్వామివారి ముఖారవిందమును జూడఁగానే మనకష్టములు వెనుకకుఁ బట్టినవి.

రాజ—నిషాదులారా! మీరు పొండు.

నిషా—చిత్తము దండాలు (నిష్క్రమింతురు.)

రాజ—సారంగధరా! సుబుద్ధీ! నేను వేఁటకుఁబోయి వచ్చినను మీరిరువురకి గురువొద్ద విద్యల నభ్యసింపుఁడు.

సారం, సుబు—చిత్తము సెలవుఁ గైకొనియెదము (నిష్క్రమింతురు.)

రాజ—(తనలో) నావిరహంబునఁ గోర్వఁజాలని చిత్రాంగి నూరడింపఁ దన్మందిరంబున కరిగెద. (పరిక్రమించును.)

చిత్రాం—(ప్రవేశించి తనలో) ఆహా! ఈవృద్ధనృపుఁ డెంతమోసముచేసెను. మొట్టమొదట తనకుమారుని చిత్రపటంబుఁ బంపి నన్నోడఁబఱచి నాపటంబును దాఁచి తాను మరుబారికిఁ జిక్కి స్వయముగా వివాహమాడెను. అక్కటా! కాముకులకు యుక్తాయుక్తవిచారము జనింపదుగదా! పురుషునకు దగవు చెప్ప ధరణీనృపుండె ధర్మంబునకు దప్పినఁ దప్పువారెవ్వరు. ఇంతయు నాయురాకాంతుఁ మూఁగబనిమేమో నావ్రాఁతకు నేనే నిందించుకొనవలయును. అట్లుకాని యూరడిల్లుట యెట్లు?

చ. అసదృశ మోవిలాసముల నన్నుల కన్నుల పండువైన వా
ని సరసఁజేరి మార సుఖనీరధి నోలల నాడవచ్చుఁ గా
కుసుమములు వీడనున్న పతినొందిన దేనిని బాపుకొందు నీ
విసమును ద్రావిచచ్చుటయె వృద్ధుని పొత్తునకన్న మేలగుఁగా.

(చింత నభినయించును)

రాజ—(తనలో) దేవి ముఖవికాసంబు దక్కియున్నది. నాయరణ్య ప్రయాణంబును గర్ణాకర్ణిగా విని యిట్లు దిగులుపడెనని తోఁచుచున్నది. కానిచో నింతకేమి కారణంబు? అవును. అనురాగంబు గలిగిన పురుషుని విరహంబునకన్న నుత్తమపతివ్రత కింకొక కష్టమున్నదా? నా ప్రయాణము విన్నంతనే వంతనొందు నింతికిఁ బిట్టపిడుగు వంటి యీవార్త నెట్లు చెప్పఁగలను? అయ్యో! చెప్పకేనియుఁ బంచశరబాధ చేఁ బ్రతుకఁజాలనేమో? ఎట్లయినఁ జెప్పియుండి యేగుటయే భావ్యము.

(అని పరిక్రమించును.)

చిత్రాం—(లేచి) మనోహరా! మీసేవకై యెదురుచూచు మీ గారాబంపు నారీమణి నమస్కరించుచున్నది.

రాజ—కళ్యాణి! కళ్యాణమగుగాక! నేఁడు నీతోడ నొక కష్టవార్తఁ జెప్ప వలసి వచ్చినది.

చిత్రాం—(భయముతో) అంతఃష్టవార్తయేది?

రాజ—మానినీ మరేమియుగాదు. మనమిరువురము కొంతకాల మెడఁబాయు వలసివచ్చెను.

చిత్రాం—(తనలో) అదియే నాకుఁ గావలసినది. (ప్రకా) ఎందుచేత?

రాజ—చ. ఘనమృగవారబాధలకు గానిలుదిక్కులు లేనివారలై
మనములఁ గుంది దుర్బలుల మన్పఁగ భూరమణీధవుండె ది
క్కని జనులెల్ల వచ్చిరట కక్కడ వారల చింతబాప నేఁ
గనికరమూని పోయెదను గాదఁకిష్ట మొసంగుమో సతీ!

చిత్రాం—(తనలో) నేఁడుగదా సుదినము! కడుపులోఁ బాలు పోసినట్లున్నది. ఎప్పుడీ ముసలిగ్రహంబు వదలునాయని వేవురు దేవతలను నదేపనిగా మ్రొక్కుచున్నాను. వనమునకేగాదు. పితృవనమున కేగినను సరే. (ప్రకా) జీవితేశ్వరా! మిమ్ములను విడనాడి యొకత్రుటికాలమైనను నోర్వఁగలనా? మీరొడ్డోలగంబున నున్నతిరి నడిచాలించి యెప్పుడు వత్తురాయని కులదేవత లందఱికి మ్రొక్కుచుందును. అట్టి నేనా మిమ్ములను విడనాడి యుండుట! మీకీ చిత్రాంగి నీడవంటిదిగా భావింపుఁడు. అదియేమి కాలవిశేషమో కాని నీయుంపనురాగము నాకు మెండు. పయికిఁ జెప్పనేల! మనస్సే సాక్షి. నేనును మీతోడ వచ్చెద. మీకన్న నాకెవ్వరు.

రాజ—అవును నీసంగతి నాకు మాత్రము తెలియదా? కల్లకపటంబు లెఱుఁగని ముద్దరాలవు గావున నిట్లు పలికితివి. కాని వినుము.

సీ. భీకరానేకప బృంహితంబులు గాని సరస సంగీతవైఖరులు లేవు
చిత్రాం—సరస సంగీతవైఖరులవును ఖతిచెంత శార్దూల కేసరీ స్వనములైన
రాజ—దాళపర్ణాచ్ఛాదిత కుటీరములు గాని శశికాంత సౌధరాజములు లేవు
చిత్రాం—శశికాంత సౌధరాజములౌను ధవుసమీపంబున దుర్గమేరంబులైన
రాజ—గీ. వనమునం దటకీ వేతెచ్చు పేడ, మంచిచెడ్డలఁ దెలియఁ జంచలాక్షి.
చిం—నిలయమందేడ నేడనిలుచుపేడ, మంచియో చెడ్డయో గాని మనవిగొనుఁడు.

నాథా నన్ను మీతోఁడఁ దీసికొనివెళ్ళుటకు మీకుఁ గామదేవుండు బుద్ధి పుట్టించుఁగాక.

రాజ—చెలీ! మృగబాధాపీడితులై పుళిందులు వచ్చుటచేత నే నేఁగుచుంటిని గాని నిన్ను విడిచి వెళ్ళుటకు నాకు మాత్రము కాళ్ళాడుచున్నవా యేమి? నిమిషము నీవు కనుపడకున్నఁ జిత్రాంగి చిత్రాంగి యని కలవరించు నీ రాజనరేంద్రుఁడు బొందితో నూరకట కరుగుచున్నాఁడు. కాని, పంచప్రాణంబులను నీయందే పాఁతుకొల్పినాఁడు సుమా! అబలా! అరణ్యములో నా యెడ నుండఁ జాలనని చెప్పితివి గాని నాకు నిన్నువీడుటకు మనస్సా! వెంటనే వచ్చెదను. ఈ నాలుగు దినము లెట్లనో కన్నులు మూసికొని కాలము మెల్లఁగ వెళ్ళదీయుము.

చిత్రా—నాథా! మిమ్ముఁ బాయఁజాల జాలినొందరేల? అదియు నా పాపకర్మమే కాఁబోలు! మీవియోగంబునకే నెట్లుబ్రుకఁగలనో తెలియకున్నది. మరల నన్ను జూచెదరో చూడరో! వేయేల నా ప్రార్థన మంగీకరించి మీరిచ్చటనే యుండుఁడు.

రాజ—కాంతామణీ! నేనిక్కడనే యున్నఁ బ్రజలు బాధలొందెదరు రాజంతఃపురమ్మును విడువఁడయ్యెనని పౌరులు పరదారంగుల నిందింతురు. కావున వెళ్లక తప్పదు. నిన్నుఁగూడఁ దీసికొని వెళ్లుదమన్న నెండకన్ను వానకన్ను నెఱుఁగనిదానవుగదా! నీవట్టున వీడి వీటనుండుమా. నామాటవినుమా. ఇఁక నే నేఁగుదునా?

చిత్రా—(తనలో) ఇంక నుండుమని యెక్కుడగా బలవంతముఁ జేయఁగూడదు. ఏలయన నితఁడుండిన నా మనఃకువలయ సారంగధరుఁడగు సారంగధరునిఁ గలియుట కవకాశము కలుగదు. (ప్ర) పతికి నెదురాడుసతికి గతులు కలుగవు. కాఁబట్టి యేనూరకుండెదను గాని మీరుమాత్రము త్వరగా దయచేయవలయునుసుఁడీ.

రాజ—ప్రియురాలా! నిన్నువిడిచి దీర్ఘకాలముందునని నీవెట్లనుకొంటివి వెంటనే వచ్చెదను. ఏమో చెప్పితినని యెంచకుము. తడవయ్యె పోయెద.

(నిష్క్రమించును.)

చిత్రా—(తనలో) తలపీడ వదలినది. ఈ ప్రియుఁడు చెవులుగలవానికి నొడలంతయు ముడుతలుపడువానికి నామడదూరంబున్నంతనే ముసలికంపు గొట్టువానికి నాయట్టి యోగ్యాతారుణ్య లావణ్యధన్య వలచినదని నమ్మినాఁడు. ఇతని నామృత్యుదేవతయే వలవవలయు. ఎవ్వరు చేరనైనఁ జేరఁదీయదు. నన్ను మాయఁబుచ్చి పరిణయంబగుట చేతనయ్యెగాని నామనంబు వశపఱచుకొనుట యితనివశమా? ఇతనినేఁగన్న యబ్బవశమా? నా

యెవరుదవిలి కానకుఁ బోయినవాఁడు కానకపోయిన నాకన్నులు చల్లపడును. ఏవే లైన నామొఱవిని యడ్డుపడి వీని దేశాంతరవాసునిగాఁ జేసినవ్వేళ్ళ వేఁడుదలంచు కొని బ్రతికెదను. మృగయాకాలంబున నేఘాతుకమృగంబో వీనిని మ్రింగిన నింగి నంటఁ బొంది పెద్ద పబ్బము చేసెదను. అయ్యో! ఏమి నాచిత్తము. వికార సారంగధరునియం దలిబాళిచే నేమేమో తలపోయుచుంటిని. సారంగధరా! వదనవిజిత సారంగధరా! నీపేరువినఁతమాత్రముననే హర్షశోకంబులు మనంబు నాక్రమించుచున్నవి. దారితపిక రొప్పఁజోవత్తువుగాని యనుదినమొకసారియయిన నీవదనసోమునిఁజూపి నాకామతాపంబు బాపుటకురావు నీజనకునకు జంకెదవేమి? ఇప్పుడట్టిప్రతిబంధకములేదుగదా? రావేమి కౌఁగిట నలరింపవేమి? చిత్రపటంబున నిన్నుఁజూచి వలచినది మొదలు నేఁటి దనుక నన్యుని బంచబాణునినైనను లక్ష్యంబుసేయక నీవే దైవంబుగా నెంచుకొను బద్ధా నురాగను నన్ను గ్రీగంటనయినఁ జూడకుంట పాడియా? నీరూపంబు కన్నులకుఁ గట్టి నట్లుండుటచే మఱియన్నను దలఁపునకురాదు. దృశ్యంబగు సకలంబు నీవేయని భావిం పుచుంటిని సారంగధరా! చిత్రాంగీచిత్తకువలయ సారంగధరా! శిరీషకుసుమ పేశల చారుశరీరా! అభినవవదనకళ సుందరాకారా!

(అని మూర్ఛిల్లును)

మనో—(ప్రవేశించి తనలో) భర్తృవియోగంబునం గాఁబోలు నీమె వాడినపుష్పంబువలెనున్నది. (యోచించి) కాదుకాదు. పతియున్న యతివలెఁజూచు నీమెకేమిచింత! విరహించినట్లున్నది. పిలిచి చూచెదను. (ప్ర) అమ్మా! అమ్మా!

చిత్రా—అమ్మాయని పిలిచెదవేల? కొమ్మాయని యొకసారి నోటియారఁ బిలువుము. సుకుమారా? నీచిత్రపటమే నాకాధారమా?

మనో—అట్లనెదవేల నేను నీచెలికత్తెను మనోరమను.

చిత్రా—(సిగ్గునభినయించును)

మనో—(తనలో) అమ్మాయనక కొమ్మాయని పిలువుమనుటచేతను నీచిత్రపటమే నాకాధారమా యనుటచేతను సారంగధరుని యందీమెకు వలపుజనించినట్లు తోఁచుచున్నది. (ప్ర) తల్లీ! సిగ్గుపడెదవేల? కామదేవుఁడు నీమనోరథంబును బ్రసాదించును గాక.

చిత్రా—నాకు మనోరథమేమున్నది?

మనో—చెలికత్తెలయొద్దనా దాపరికము కాన్యాంతరమునందున్నను నాయెకా కాయకునకు దూతికలు పెట్టినదే భిక్ష.

చిత్రా—నిజము అతిరహస్యము కావున వెల్లడియయిన గార్యప్రాణహానులు సంభవించునని సంశయమొందుచున్నదాన.

మనో—సంశయమేల? నేను వెల్లడిసేయను గూఢంబుగా నుంచెదను.

చిత్రా—అట్లుంచుటయేగాక నాకీ కార్యమునందుఁ దోడ్పడవలయును.

మనో—ఏకార్యమునందు?

చిత్రా—నానోటిచేఁ బలికింపవలెనని తలఁచితివి కాని పరాభిప్రాయజ్ఞవగు నీకుఁ దెలియనిదేమున్నది? అయినను చెప్పెదను. ఈసంగతి మూఁడవచెవిని బడకుండ నుంచెదననియు నోపినకొలఁది ప్రయత్నింతుననియుఁ జేతిలోఁ జేయి వేయుము.

మనో—(చేతిలోఁ జేయి వేయును)

చిత్రా—సఖీ! నాచిత్తం బెప్పుడు సారంగధరాయత్తంబై యుండు. ఈలోక మంతయుఁ దన్మయముగా నుండును. అతనితో నతనునికేళి విహరింపకున్న నీతను వేల? ఈప్రాయమేల? ఈసౌకుమార్యమేల? చెలీ! నాకుఁ గూర్చునావు కాన సిగ్గువిడిచి చెప్పుచుంటి. అతఁడు నన్నేలనిచోఁ జావుచేతనో విషంబుచేతనో ప్రాణపరిత్యాగంబు జేసికొనియెద.

మనో—నేనుండ నీకుఁ బ్రాణత్యాగావసరమేల! సారంగధరునిఁ గాదు అనింగి నిమన్న సారంగధరునయినఁ దెచ్చియిచ్చెద. ఎట్టికర్జమయిన నాచిటికెనవ్రేలిగోటిలో నున్నది.

గీ. అతివ! యరచేతి వైకుంఠ మమరఁ జూపి, వానినిటకుఁ దెచ్చుట నాదు వంతునుమ్ము
చిత్రా—కాంత! వసిష్ఠుని పేరెదుకాయఁ జేసి, వాని చెలిమి సేయుట నాదు వంతునుమ్ము

నీవిక్కడకు వానిని తీసికొనివచ్చిన నాకోరిక నెరవేరినట్లే.

మనో—(తుమ్మును)

చిత్రా—సఖీ! నెరవేరదని దుశ్శకునంబుగాఁ దుమ్మితివి కాదుసుమ్మ. అవక్రపరాక్రమనిర్జితశత్రునరేంద్రుఁడగు రాజరాజనరేంద్రుని నిలువుమన్నచోట నిలుచునట్లు చేయు నాబోఁటి బోటికిది యొకలెక్కా? ఈయనిమిత్తంబులు పిరికివారలకుఁ గాని యిట్టివి వేయియయిన నాకు వీసమంతయు లక్ష్యములేదు. నామనోహరు నెట్లు తీసికొనివచ్చెదవు?

మనో—నేనును నాసఖియగు కృష్ణవేణియుఁ బురుషవేషంబులను ధరియించి జయసేన శూరసేనాభిధానములతోఁ గలరవ క్రీడాపరాయణుండగు నా సారంగధరుని కడకేగి యేమిషచేతనయినఁ దీసికొనివచ్చెదను. పోయివచ్చెద. (నిష్క్రమించును)

చిత్రా— కేనునుబోయి నాప్రయత్నంబులో నుండెద. (నిష్క్రమించును.)

గద్య— ఇది శ్రీ అష్టావధాని విమ్మభట్ల సుబ్రహ్మణ్యేశ్వర ప్రణీత
సారంగధర నాటకము నందలి
ప్రథమాంకము.

---



# సారంగధరనాటకము.

## ద్వితీయాంకము.

---

రాజవీథి

(సారంగధరుఁడు, సుబుద్ధి, జయసేనుఁడు, శూరసేనుఁడు, ప్రవేశించుచున్నారు.)

జయ— సారంగధరా! ఏమియోజించెదవు, పారావతక్రీడావిహారంబంగీకారంబే నా?

సుబు— మిత్రమా! మీతండ్రిగారు నీకుఁ ద్వరలోఁ బట్టాభిషేకంబు సేయుదల యునని తలంచిరిగదా! తపోమహో మూర్ధాభిషిక్తుండవగునీవింకను శైశవంబును విడువక యాటలకుఁ బర్వులెత్తుట యనుచితము నీకిదియేమో కాని పావురములమాటయున్న నన్నపానంబుల పేరయినఁ దలంపవు ఇంత వ్యసన మున్న నదియెట్టిదయిన హానికరము.

సారం— జయసేనా! ఎంతదూరమునుండియో వచ్చి పందెమునకుఁ బిలిచిన మిమ్ముఁ గాదనఁజాల. నాహితుని హితము నతిక్రమింపఁజాల. ఎటులయిన నాపంగడీని సమ్మతిపఱచి పిదప వచ్చెద. (సుబుద్ధివంకఁ జూచి) మిత్రమా! రాజ్యభారంబువహించి నవెనుక పేయాటలకుఁ బోవఁగూడదుకదా! ఇదియే నాజన్మమునకుఁ గడసారియాట కావున వద్దనుమాటలను జెప్పకుము.

సుబు— దుర్గతి కారణంబులును దోషాపణంబులును నయినపణంబులు నింద్యములు వ్యసనంబులం దవిలి యెందఱో సర్వశూన్యులయిరి.

సారం— మిత్రమా! ఇందు వ్యసనమేమియున్నది? వినోదవ్యాపారము.

సుబు— మొట్టమొదట వినోదంబుగానుండి తుట్టతుదకు విచారముగాఁ బరిణమించును.

సారం — పణంబుల కావ్వని పంబడి పుడు వెనుకంజవేయుట భూనేతలకు నీతి గాదు కావున నా యభిప్రాయముతో నేకీభవింపుము.

సుబు — నెచ్చెలీ! మంచిచెడ్డలను జెప్పితిని గాని మఱియొకటిగాదు. నీయిష్టము

శూర — మీకు భయపడ నేకాలమంతయుఁ గడపుచుంటిమి. పందెము వేయుశక్తి యున్న వేయుఁడు. లేనిచో మాచేత నేమియుఁ గాదని మోము వంచికొనుఁడు.

సారం — శూరసేనా! ఎంతమాటపల్కితివి. శేషసంబు పణంబులు దూషణంబులని సంశయించుచుంటిమి. కాని నీకును నీరాజునకును జంకి కాదు సుమా? వేయఁగల పందెమేదియో వ్యక్తీకరింపుము. ఒడ్డెదము.

జయ — (తనలో) ఎవరిదేశంబున వ్రాలిన పావురములు వారుస్వాయత్తముగాఁ బట్టి తెచ్చునట్లు పందెము వేసెదను. నా పావురంబులు చిరాలంగి మందిరంబునఁ బెంపఁబడినవగుటచే నచ్చట వ్రాలును. దానిచే నితనికి నామందిర ప్రవేశంబు తటస్థించును. (ప్ర) ఎవరి పావురంబులు గెల్చిన వారికి లక్షరూప్యంబు లొసంగుటయే గాక మన పావురంబు లేరి రాజ్యంబున వ్రాలిన వారు స్వాయత్తముగాఁ దెచ్చి యీయవలయును. మీకు సమ్మతమేనా?

సారం — మీ సమ్మతమే మా సమ్మతము; ఇందులకు భూమ్యాకాశ గ్రహంబులె సాక్షులు. పావురంబుల నెగరవేయుదము.

జయ — మంచిది.

(అందరు పావురంబుల నెగరవేయుదురు)

సారం — మిత్రమా! సుబుద్ధీ! పావురంబులను జూడుము. (ఆకసమువంకఁ జూచి

సీ. ఘరగ బాలక ఖేల నోద్ధమహమ్మహః ప్రిచలత్ప్రిథంజ పటములనఁగ
నప్సరోనికురుంబ హస్తాంబుజహయుగ్మ గాజనిర్మిర ముకురంబులనఁగ
నిజజరసారితస్వీప్రతీరవిహారితశ్వగ హంసపోతంబులనఁగ
గగనసీమంతినీ గళహారవిచ్ఛిన్నమునియుత మౌక్తికంబులనఁగ

గీ. క్షీరరారనిహారడిండీరహార। హీరసారఘటీర మందారవార
చైత్ర నేత్రప్రభాకణశశిచ్ఛవులనఁ। బావురములొప్పి రవివాహమంబులనఁగ.

జయ — కన్నులు మిఱుమిట్లు గొల్పెఁబోయి విష్ణుపదంబె తమయిల్లుగాఁ జేసికొని యుండుకుం బారావతంబులు గానరాకున్నవి. అవి యెచ్చట వ్రాలెనో గదా!

(తెరలో)

గీ. గాలిపటము పోలికనాడి కట్టకడకు। వ్రాలెఁ జిరాలంగిమేడపైఁ బావురంబు
దరిశింకరుండౌచు సారంగధరుఁడు పక్షి। మాద్రిమీఁద నీకతి వ్రాలియున్న యట్లు.

సుబు—(చెవులుమూసికొని) పాపహరా! పాపంబుశమించుఁగాక. ఎవఁడవురా యమంగళవచనంబు వాడితివి?

(తెరలో)

అయ్యా! నేను సేవకుఁడను. జయసేనమహారాజు పావురంబు చిత్రాంగిదేవిగారి శ్రీపాదంబులపై వ్రాలెను. సేవకుని మాటలయందుఁ దప్పులున్న క్షమింపుఁడు.

సుబు—ఈయమంగళంబు సారంగధరునిఁ బొందకుండునట్లు సారంగధరుండే కాపాడవలయును.

జయ—సారంగధరా! నాపావురంబు నారాజ్యమునందే వ్రాలెను. కావున న్యాయముగాఁ దెచ్చియిచ్చి సత్యంబును గాపాడుకొనుము.

సారం—నేనిదే వెళ్ళుచున్నాఁడ (వెళ్ళఁబోవును)

సుబు—(తనలో) మున్నొకనాఁడు వసంతపూజాసమయంబున నీసారంగధరుని జూచి చిత్రాంగి బాళినొందినట్లు కర్ణాకర్ణికగా వింటిని; ఆమె పుట్టినింటివారిచే నరణంబుగాఁ బంపఁబడిన మనోరమయను నామెయు సారంగధరునిఁ దీసికొనిపోవుటకుఁ బ్రయత్నములు చేయుచున్నట్లే వింటిని. వారి ప్రయత్నంబున కనుకూలంబుగా రాజూరలేఁడు. చిత్రాంగి నడుమవయస్సులో నున్నది. ఇంతియకాక సారంగధరుని పటమును జూచి యతనినే వరించినది. రూపవతియగుటచే రాజు పెండ్లియాడినను నామెకు మాత్రము సారంగధరునియందు బద్ధానురాగము కలదు. కావున నిట్టి తరుణములో నాతరుణి తనకోరిక కొనసాగించుకొనుటకుఁ బ్రయత్నము చేయకుండునా? చేసిననేమి? నాహితునిమతి నాకుఁ దెలియదా? తెలిసిన నీకాలమున కేబుద్ధి పుట్టునో? అట్టి యవినీతుఁడా! కాఁడు. కాఁడు. కాని యీయామె విఫలమనస్కురాలగుటచేఁ దన ధవునితో నేమేమో చెప్పి శిక్షింపఁజేయక మానదని తోఁచెడిని. అప్పుడు సుబుద్ధి యింతమాత్రము చెప్పి నివారింపకపోయెను గదా యని నిందింతురు. కావున మొగమోటమిని వీడకూడదని మందలించెద (చేయిబట్టుకొని ప్రకాశముగా) పోఁకూడదు.

సారం—ఎందుచేత?

సుబు—తగినంత కారణ ముండకపోలేదు; నీవుమాత్రము వెళ్ళకుము.

సార—చల్లకైవచ్చి ముంతదాచనేల? ఏమికారణమో చెప్పరాదా?

సుబు—కోపమే ప్రధానముగాఁ గలిగి యుక్తాయుక్త విచారశూన్యుండవయిన నీతో నాకు వాగ్వాదమేల? పిలువని పేరంటము నీకేల?

సారం—రహస్యమా?

సుబు—అవునవును రహస్యము; మానినులపాలికి మాటిమాటి కేగుట మర్యాదగాదు.

సారం—తల్లికద, గొదుకున కేమిమర్యాద కావలయును?

సుబు—ఆమె నిన్ను మర్యాద చేయనక్కఱలేదు. నీవే కాపాడుకొనవలయును. ఏల యనఁ?

మ. స్త్రీయందు స్వధుని న్స్వనాయక చతుర్థికాం దక్క నేవేళ నై
న రహిం గాంచిన అట్టు కామ పరకాంతా వక్త్రికున్ భ్రాంతునిం
బరికింపంగ రహస్యమందు నెప్పుడైన న్నిందవాటిల్లుఁ గా
న రుపక్షాబోవిడి యాలతాంగికడకున్ నానెచ్చలీ! పోకుమీ.

సారం—పరకాంతయైన నిజమే; తల్లి కావున దప్పేమి?

సుబు—లోకులనుకొనుటకుఁ దల్లియైన నేమి!

సారం—మిత్రమా! ఎంతవిపరీత వాక్యములాడితివి. వినుము,

చ. తలఁచిన నొక్కవేళఁ బరతామరసాక్షుల నన్ను వేఱుగాఁ
దలఁతును గాని నా పినతల్లిని నన్ను మాటొక్కరీతి గాఁ
దలఁపను నేను నన్ గనిన తల్లిని నామెను నొక్కరూపుగాఁ
దలఁచుటఁ దల్లిబిడ్డలకుఁ దప్పదు దుర్జను లైన భేదముల్.

సుబు—(తనలో) ఇతని మనస్సు మంచిదగుటచే లోకమంతయు మంచిదిగానే భావించుచున్నాఁడు. కాని చిత్రాంగి హృదయ మెఱుంగఁడు. నీ పినతల్లి యిట్టిదనినఁ గోపపడునేమో? కోపబడునని యూరకుండుట యెట్లు? పోని సంఘముమీఁద స్త్రీల దుర్మార్గచాంత్రిని చెప్పెదను. (ప్ర) మిత్రమా! జలజాక్షుల స్వభావం బెఱుంగవు వినుము.

సీ. ఎట్టికట్టిడిపను లేని సల్పుచుఁ బైఁ శ్రీరంగనీతులఁ జెప్పుచుండ్రు
ఒకటికిఁ బదియాను నొనరఁగల్పనజేసి వరునిపై కొండెముల్ వల్కుచుండ్రు
పేరుల దిగనాడి పిల్లిపై నెలుకపైఁ బెట్టి యయ్యలఁ జావఁదిట్టుచుండ్రు
ఎవరినో యున్నఁ దమ్మేయా సినారంచు బ్రహ్మరాక్షసులట్లఁ బఱపుచుండ్రు

గీ. పీరివారిపాట్లను మూడివెట్టి పెద్ద। చిచ్చుకలిగించి పకపక నవ్వుచుండ్రు
వింతగఁ దడిగుడ్డలతోడ గొంతుకలను। గోయుచుండ్రు లోలాక్షులో గుణనిధాన.

సారం—మిత్రమా! నీవు చెప్పినవి యొవరికైనఁ జెల్లును గాని మాపినతల్లికిఁ జెల్లవు.

సుబు—ఎంతవెఱ్ఱివాఁడవు! మీ పినతల్లియు నొక్క వనితయేగదా.

సారం—అయిన నేమి?

సుబు—(తనలో) ఇతఁడుఁ న్యాపదేశంబును గ్రహింపకుండె. స్పష్టముగా నీపిన తల్లి దుర్మార్గురాలని చెప్పవలయును. చెప్పిన నామఁ గిదే. కీర్తి నీ మాతృన్న

నిలఁ దచ్చోటున కేగక యుండుము. ఏగినఁ గీడు మూడుటయే నిశ్చయము. నాకీమున కొప్పదనుగాని పలువురికిఁ దోఁచుపగునట్టి యొగ్గదని నోర్వఁజాల. కావున నే నిదియెట్లయిన జెప్పితీరవలయును. (ప్ర) మిత్రమా!

ఆ. సక్క్రవినయముల సట్టిల్ల సాహస । మందుసందడించి వేసిఁ పెట్టి చేయి
తలలుమార్చుటందుఁ దొలుతఁ బెట్టిఁ పేరు । చానగాన నటుకుఁ జనుటతగదు.

చ. తెలిసినవాఁడవైన మటి తెల్పుచునుంటి క్షమింపు పీటిలో
పల మన యేఁడు లేఁడు నడుఁ బ్రాయపుటన్నలమిన్న యాపె నీ
వల మరుబోలినాఁడవు లతాంగిమనంబెటులుండునో చుఁడ
వలసట కట్టుపోయి యెటుసచ్చునొ యొంటరిపాటు చోటునన్.

సారం—మిత్రమా! చనువిచ్చుటచేతనా యిట్లులాడుచుంటివి. చాలుఁ జాలు.

చ. ఘనతరవంశమందు మణికైవడి పుట్టి యశోభిరాముఁడై
తనరు నరేంద్రచంద్రు కరతామరసంబును బట్టి తద్గృహం
బున నొగిమెట్టి దోషములపోలికనైన నెఱుంగనట్టి నా
జననిని వేఱుగాఁ దలఁతె సాధ్వసముం విడనాడి వాకడన్.

ఏదియో బలవత్తరంబగు కారణంబును జెప్పదలఁచుకొంటినిగాని యట్టిందువని యనుకొనలేదు. మిత్రమా! వింటివా!

గీ. తనదుమనమందుఁ గలుషంబు గనినయేని । దుర్జనులభంగి సజ్జనుల్ దోఁచుచుంద్రు
మేనమసిపూసికొని చూచెనేని స్వచ్ఛ । మైనముకురమందున నల్లఁగానరాదె.

కావున మనయందలి తప్పామె యందారోపింపనేల? నే నేగెద.

సుబు—మిత్రమా! నామనవి నంగీకరింపుము.

గీ. తెలుసుగలవానిఁ జిలువవ్యాలొందయువానిఁ । గులుకుగలవానిఁ దనకుప్రి వెలయువాని
సుకృతవశమునఁ జాటుఁ జూచెనేని । క్షణములోఁ గైకొనదె యెట్టి కాంతయేని

సారం—(చెవులు మూసికొని) శివశివా! సుబుద్ధీ!

చ వలపుజనించి తల్లి తనబాలుని వేఁడునటంచు నీగతిం
బలుకఁగఁ జెల్లునొక్కొ మగవారు ప్రయత్నము సేయుచున్నచోఁ
బొలఁతులు ముందుగోరుదురె? పుట్టిన బిడ్డకుఁ బేరుపెట్టుదే
వలననునైనట్టి పలుపలుకాలవింటిమె కంటిమే కటా?

సుబుద్ధీ! నామనస్సు దెలియని వాఁడవు కావు. పావురంబును దీసికొని యిప్పుడే వచ్చెదను.

సుబు—ఉభయుల మనంబులు నిర్మలంబుగా నుండవలయును గాని యొకరికి యున్న నేమిలాభము.

సారంగ—నీవనుకొనినట్లు లామె దుష్టురాలా ? నా పినతల్లి గాదా ?

చ. తనయునిఁ దల్లిగోరునని దద్దయుఁ జెప్పితి వెట్టిమాట

సుబు— కొ

రిన నొకవేళ

సారం— నమ్మయని పేర్మినుబిల్వ మటొక్కటి గనక

గనునొకొ

సుబు— యద్ది గాదనుచుఁ గాంచిన

సారం— నీకుఁను తప్పదారినిక

జనునొకొ వార్ధలింకిన నిశాకర భాస్కర తారలూడినన్

సుబు—పినతల్లిగదా కుమారుని నన్ను కోరునా యని తలంచుచుంటివి కాని యామె యభిప్రాయ మెఱుఁగవు.

క. తనకడ నేమజనునయినఁ । గనిప్రాఁకెను వల్లభంగిఁ గామిని యొందుం దనచె తను నెఱుఁగను నే । జను నైనను బైగొనును నిజంబిదె సఖుఁడా !

కార్యమునకు ముందే యోచించియుండవలెను. పిదపఁ బశ్చాత్తాపబడిన లాభము లేదు.

సారం—సుబుద్ధీ ! ఏటికీవ్వ ధాకంతశోషి

చ. తనకడఁ జేరి ధర్మపుబథంబు గ్రహింపఁగ వేఁడుదానికిన్ గనికర మొప్పఁ జెప్పఁడగుగా కిటులాడఁగ నేల మిన్నకుం డిన బదివేలు మొక్కులిక నెట్టివిపత్తును గాంతువన్న నే నొనరిచినట్టి కర్మ మెటులో యటు లేయగు నేనుండినన్.

సుబు—మిత్రమా! నీపట్టును వీడవా?

సారం—ఇందు పట్టేమియున్నది ?

సుబు—

గీ. పావురంబుకై పినతల్లి భవనమునకు । నేనుబోయెదననుపట్టు నీకు నేల యొవరిఁబంపిన నేరుందు రింతపాటి । పనికినీ వేల యటు కేగవలయుఁ జెపుమ.

సారం—మిత్రమా! నీవు వినియుంటివిగదా! నే నాబయనేమునితో స్వయము గాఁబట్టి తెచ్చెదనని శపథంబునుజేసి యుంటిని. ఇప్పు డన్యతమాడి తద్దోషంబు నొందజాలం

సుబు—

గీ. ముప్పవాటిల్లుచుండునే జెప్పచుండ । సవతితల్లి గేహమునకుం జనెడువేళ
లోఁగులోఁతని గొంతెత్తి లోకులడువ । వింకమునుకులోఁ బడఁబోవు వెఱ్ఱిపోలె.

సారం—మిత్రమా! ఇంకను నీచదువును గట్టిపెట్టవా? ఆయాసము పడితివి కాఁబోలు విశ్రాంతిఁ గైకొనుము.

సుబు—

గీ. చిన్ననాఁటనుండియుఁగల చెలిమిచేతఁ । దిపుడు మీ ముప్పు ముందుగ దినిన కతన
హితము కోఱలేక చెప్పరుచింపకుండె । వ్యాధిపీడితునకుఁ బథ్యమట్టులకట!

సారం—సఖా! సుబుద్ధీ! నాకెన్నఁడు దమృతపాత్రికంబుగానుండు నీవాక్యంబు లిప్పుడు విషప్రాయంబులుగానుండె నామాటవిని నీహితోపదేశంబు నింక నయినఁ జాలింపుము.

సుబు—

గీ. దయహీనుండు గీదినగీత దాటకుంట । తొలుతఁగష్టమైనఁ బిదప గలుగుసుఖము
చెవులు కుట్టించుకొనువేళ సిలుగుఁజెంది । భూషణములు పెట్టుకొని సంతోషపడరె
మిత్రమా! నిన్నుఁ బోనిచ్చుటకు నామన సొప్పకున్నది.

గీ. కలికిచెంతనీచిత్తంబు కఱఁగుఁజుమ్మ । వహ్నికడనుండు నాజ్యకుంభంబుపోలె

సారం—

నుంతయేనియు దుష్కృతము నాయంతరంగ । మంకుఁజొరదుకీలికిఁ జెదలంటునట్లు.

జయ—సారంగధరా! ఏమి గుసగుసాలోచనంబు జేయుచుంటిరి? నీ వెప్పుడు పావురంబునకు వెళ్ళెదవు? ఎప్పుడు తెచ్చి యిచ్చెదవు? కాలవిలంబన మేల? మేము త్వరగాఁ బోవలయును.

సారం—రాకుమారా! ఆలస్యంబునకు మన్నింపుము ఇప్పుడే పోవుచున్నాఁడ.

(వెళ్ళఁబోవును)

సుబు—(గట్టిగ సారంగధరునిఁ బట్టుకొని) నీవేమియనుకొన్నను సరేగాని నిన్ను మాత్రము పోనీయను.

సారం—(కోపముతో)

చ. పూర్వపుదేహమున్మఱచి పోయితొ కొంచెము పిచ్చిపట్టుటన్
బర్వములన్మఱెంత యయి వాగెదొ మాయసుబుద్ధివో

సుబు— యిటుల్

చర్విత చర్వణంబుగ నిజంబు వచించిన తప్పు గాక యో
యుర్వరనాథపుత్ర! మఱియొక్కటియున్నది తప్పు నాయెడన్.

గీ. వలదు వలదన్న హితము నుబల్కువారు । వెంటబడి బోధింతురు వినువులేక
గానఁజెప్పితిఁ గా కొడిగాసనేత । హాయిఁ బడునంచుఁ జెప్పలేనయ్య మిత్ర.

సారం—మిత్రమా! నన్ను విడువుము.

సుబు—పిచ్చోడ! నిన్ను విడువఁజాల.

సారం—సుబుద్ధీ! నన్ను వెఱ్ఱివనుచును దూఱ్ఱమేటికి?

సుబు—సారంగధరా! నీవు వెఱ్ఱివనను దూఱ్ఱమేటికో నాకు వెఱ్ఱివనను దూఱ్ఱము దానికే ఒకవేళ నామెను గోరినగదా నాకేమి భయముకొన్నను నామె యంత యామెయే వలచును. ఒప్పవేని దానితో బొంకుచు చెప్పను.

సారం—చెప్పినంత మాత్రముననే న్యాయశీలుండగు మాజనకుఁడు నమ్మునా?

సుబు—నమ్మకేమి?

ఆ. పురుషుఁడెంతసేవ్య పాలుపొందు బొంకిన । దడినిగట్టినట్లు దనరుచుండుఁ
బొలఁతి యింతొ యంతొ బొంకినప్పటికిని । గట్టిగోడఁ బెట్టినట్టులుండు.

కావున విశ్వసించుటకేమి యభ్యంతరమున్నది. విశ్వసించిన దండనార్హుఁడవుగాదా?

సారం—(తనలో)

క. పినతల్లియఁట కుమారుని । ననువేఁడునఁట యొడఁబడని నాఁడు జనకునితోఁ
దను దప్పు సెప్పునఁట యా । యన దండించునఁట యిట్టివారియఁగలవే.

(ప్రకాశముగా) ఏటికి నీకీ వెఱ్ఱి?

చ. కలుషమటంచు భీతిలక గాదిలి మానుమిూఁద నేల మా
యలు పినతల్లి పన్ని నృపహంసు మనోంబుజమున్ గలంపఁగాఁ
దలఁచుఁ దలఁచినన్ సుతుని దల్పక యాయన యేలనెంచు నీ
వలుకు లిఁకేల జ్యోతిషికు భంగినిఁ బల్కెదు నాదుముందటన్.

వంధ్యకు బుత్రుఁడు పుట్టుననియు వాఁడు మృగతృష్ణలో జలక మాడుననియు సిగకు గగన కుసుమంబులు చుట్టుననియుఁ జెప్పుచుంటివి; చాలు! నీయుపదేశము చేసెగవను.

సుబు—నన్ను విడిచి యేగిన నెడరు దొరకను. పిదప నీమనుకొన్న ప్రయోజనము లేదు.

సారం—

గీ. కాలగతి యెట్టులుండు నాకరణి నేరి । కైనగడపఁ గాసంత శక్యంబులేదు.
కాఁగలది కాకమానదు గాన నూర । కేల నన్నడ్డగించెద విష్టసఖుఁడ.

సుబు—

చ. హితమువచించుభారమెపు డీతని కాత్మనుంటఁ మంచి పం
గతుల వచింపకుండిన నఘంబగుఁ గావున నిట్లునొక్కి చె
ప్పితినిఁక నీదు చిత్తము వివేకశిరోమణి నీకు గద్ది స
మ్మతమగు నద్దిసేయు మనుమానము లేటికిఁ జెక్క లేటికిన్.

జయ—(శూరసేనునితో రహస్యముగా) నేను జిత్రాంగిదేవితో సారంగధరుని లీలా మాత్రంబుగఁ దెచ్చెదనని ప్రతిజ్ఞఁ జేసియుంటిని. ఈసుబుద్ధి మూలంబున నది నెర వేరదేమో

శూర—ఎందుచేత?

జయ—సారంగధరుని పోక కితఁడు నిరోధించుచున్నాఁడు.

శూర—అట్లయిన సారంగధరునిఁ గఠిన కఠోర సంభాషణంబులాడి యిచ్చోటును బాయునట్లు చేసెద. (పైకి) సారంగధరా! ఏమి! యీయాలస్యము మీరొకరి చెవులు మఱియొకరు కొఱుకుకొనుచుండ మక్కాలిపీటవలె నిలువంబడ మాకర్మము కాలెనాయేమి? మీతోడఁ బందెము వేసినందులకు నిలువు కాళ్ళబత్తెము దయచేసి తిరా? నిలిచినిలిచి విసుపు వచ్చి మేము పోయెదమనుకొని కొంటెయెత్తొకటి పన్నితిరా యేమి?

సారం—అటులెన్నటికిఁ దలంపను; నేనన్యత మాడఁజాల.

శూర—అట్లయిన నిప్పుడే పొమ్ము. ఇంత చేతకానివాఁడవు మొదట పందెమేల వేయ వలయు. వేసి యిప్పుడేల లోపిఱికి వెలిపిఱికిగా నుండవలయు.

సారం—హాదైవమా?

గీ. పావురంబును దెమ్మంచుఁ బార్థివుండు । నమ్మయింటికిఁ బోఁగూడ దంచుహితుఁడు
విదువఁబోకుమనియె యాజ్ఞనిడిరికాన । నిడుకరంబులు దగిపట్టి వాఁడనైతి.

సుబు—అక్కటా! అశ్లీలము స్ఫురించుచున్నది. పాపంబు శమించుఁగాక.

సారం—సుబుద్ధీ! నీకీవిచారమేల? పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

సుబు—(తనలో)

౪. చిన్నతనంబునుండి కడుఁ జేర్మిని జెప్పెదు నాదుమాట ము
దెన్నఁడు మీఱలేదిపు డదేమియొకాని హితుండు మీఱె నే
చెన్నఁటి కానిబోధనలఁ జేసియొ యింతగ భ్రాంతిగల్గియో
యొన్నఁగరాని సృష్టలిపి యిట్టుల గట్టిగఁ బట్టి యేడ్చియో.

విధికృతంబునకు వగచిన సేమిప్రయోజనంబు? నిమ్నాభిముఖనీరంబు నివారింప శక్యంబుకాని చందంబున నితని స్థిరనిశ్చయంబును నివారింప జాలనైతి. సారంగధరున కేయాపద సంభవింపకుండునట్లు లాసర్వేశ్వరుఁ బ్రార్థింప నరిగెద.

(నిష్క్రమించుచున్నారు)

జయ—నావంతుతీరినది; చిత్రాంగి దేవివంతు నిలిచినది. ముందుకార్య మెట్లు పరిణమించునో చూచెదను. మనము పోవుదము.

(నిష్క్రమించుచున్నారు.)

గద్య—ఇది శ్రీ అష్టావధాని విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వర ప్రణీత
సారంగధర నాటకమునందలి
ద్వితీయాంకము.



శ్రీ

# సారంగధర నాటకము.

## తృతీయాంకము.

చిత్రాంగి మందిరము.

చిత్రాం—ఆహా యేమి యీ పావురముయొక్క రామణీయకము ! పావురమా! నాస్థితి యేమైన సారంగధరునితో మనవిచేసితివా? అతఁడిచ్చోటునకు వచ్చునట్లు చేసితివా? నీతో నేమనియెను? నన్ను మెచ్చెనా? ఏమి మాట్లాడవు? సారంగధర కరసంస్పర్శనరూప మహాభాగ్యంబును బట్టుకొనుటచేతనా? ఏమి యింతలో నింతయైశ్వర్యమా! నీపాటిభాగ్యంబు నేనోచనైతిఁగదా! సారంగధరా! సారంగధరా! యనుచు లోలోపల నువ్విళ్ళూరుచుండవలసినదే కాని యొకనాటికి నాకోరిక కొనసాగకవచ్చినది.

మనో—(ప్రవేశించి) కొనసాగకయేమి.

చిత్రాం—(తనలో) కొనసాగక యేమి యని నాచెలి మనోరమ ప్రవేశించుచున్నది. నాయత్న మక్కఱకువచ్చునట్లు సూచింపుచున్నది. (ప్ర) చెలీ! వచ్చితివా!

మనో—వచ్చుటయేకాదు. తెచ్చితిని.

చిత్రాం—ఎవరిని ?

మనో—నీ వలపుకానిని.

చిత్రా—ఎట్లు ?

మనో—నీతోడఁ జెప్పినట్లే.

చిత్రాం—(సంతోషముతో) నీయట్టి చెలికత్తెయుండ నాకేమికొఱంత! నీకుఁ బ్రత్యుపకార మేమిచేయఁగలను

మనో—నన్ను మఱువకున్నఁ జాలును.

చిత్రాం—చెలీ! నిన్ను మరతునా ?

మనో—కొంతకాలము దనుక మఱవవు.

చిత్రాం—ఎంతకాలముదనుక ?

మనో—సారంగధరుని కౌఁగిటిలో నలరుకాలముదాఁక.

చిత్రాం—(తనలో) ఈమె మాటకే నామేనంతయుఁ బులకాంకుర మైనది. (ప్ర) సఖీ! నాకట్టికాలము ప్రాప్తమగునా?

మనో—నన్ను మఱచిపోవు కాలము ప్రాప్తమగుచుండ నిన్ను సారంగధరుఁడు కౌఁగిట నలరించుకాలము ప్రాప్తము కాకేమి?

చిత్రాం—సారంగధరుఁడు సారంగధరుఁడని నా కాస నూరించుచుంటివి కాని యతనిని నొక్కపట్టున సుబుద్ధి రానిచ్చునా?

మనో—రానీయకేమి? మా నక్కజిత్తులముందర సుబుద్ధి హితోపదేశంబులు పనికివచ్చునా? (ఆలించి) కాలిచప్పుడు వినవచ్చుచున్నది. సారంగధరుఁడే యయి యుండవచ్చు

గీ. అతివ యఱచేత పైకుంత మమరఁ జూపి। వానిఁ గొని తెచ్చితిని నాదువంతు తీఱెఁ

చిత్రాం—

గాంతమని బూచి సేరేఁడు కాయఁ జేసి। వాని చెలిమి సేయఁగ నాదు వంతువచ్చె.

కావున నెటులయిన మాయఁబుచ్చి నా మనోరథంబు నెరవేర్చుకొనియెద.

(తొంగిచూచి) నాపాలిటి మదనమూర్తి కనుపించుచున్నాఁడు.

సీ. కందోవవిందొప్పు గాత్రంబు గలిగిన బంచమార్గణుఁడు వచ్చునేమొ!
కళల క్షయము గాక కందునొందక యున్న వారిజారిప్పుడు వచ్చునేమొ
అనిమేషతను మాని పనిమేషతనుగన్న వజ్రిపుత్రుఁడు దొర వచ్చునేమొ
అడవులఁ దపముల నాకులపడఁ డేని వరవసంతుఁడు సాటి వచ్చునేమొ

గీ. వీని చారురూపమునకు వీసమంత। యారి యీయుంచ మీచఁద మరసినంత
నలరు విలుకాని యిల్లాలికైనయంత। రంగమునఁ గంతు వలవంత ప్రిబలు టెంత.

ఆ. తొల్లి బాముసందుఁ దొయ్యలి కనకాంగి। నోములెన్ని సిద్ధ నోచినదియొ
గాంతుఁడితఁడు కాఁగ నంతంత పాత్రంబు। వారికిట్టి మేలు వలనుపడునె?

సారం—(ప్రవేశించి మనోరమం జూచి) పిన్నమ్మగారి చెలికత్తెయగు మనోరమ కాఁబోలు! ఈప్రాసాదంబుపైఁ బావురంబు వ్రాలినది. దాని నెవరుపట్టుకొనినారు?

మనో—ఇక్కడ వ్రాలగా ముద్దువచ్చి మీపిన్నమ్మగారే పట్టుకొని దస్సియున్న దానికి మేఁతపెట్టి వినోదంబు చూచుచున్నారు.

సారం—ఆమెకుఁ దిర్యగ్జంతువులయందుఁ గూడ నిట్టి ప్రేమ యుండుట శ్లాఘా పాత్రము కాని యది జయసేనునిది. పందెపుఁ బావురంబు నేనిప్పుడె తీసికొనిపోఁగి యీయవలయును. కావున నిదంతయు విన్నవించి పావురమ్మును దీసికొని వచ్చెదవా?

(కొంచెమాలోచించి) నీవు కాదు నేనే వచ్చి యడిగెదను. మాయమ్మగారితో మీకొడుకువచ్చినాఁడని మనవి చేయుము.

మనో—చిత్తము అమ్మా! మీకుమారుఁడు వచ్చినాఁడు.

చిత్రాం—మాకు మారుఁడేయైన నభ్యంతరమేమి ?

సారం—అమ్మా! నమస్కారములు.

చిత్రాం—(తనలో) అయ్యో! దైవమా! యిఁకనుచిత మాచరింపుచున్నాఁడే (యోచించి) అనుచితమేమి! దంపతులకుఁగూడ నొకానొకప్పు డిట్టిమర్యాదలు కలవు గదా! (ప్ర) అతనుసుఖంబు కలుగుఁగాక.

సారం—(తనలో) అయ్యో! తల్లియేమి యిట్లానతిచ్చుచున్నది. (యోచించి) కాదు కాదు. ఇది సంస్కృతభాషయందలిదోషము కాని యీమె హృదయము నిష్కళంకము (ప్రకాశముగా) తల్లీ!

చ. అరుణకరప్రసారమున కైన భయానకమైన నీదుమం
దిరమునఁజొచ్చి నీచరణనీరజవందన రూపభాగ్యమే
నరసి ప్రమోదసాగరము నందుననోలల నాడినాఁడ న
బ్బురముగ నేనుజేసినది పుణ్యము నావలెఁజేయ రెవ్వరున్.

అమ్మా! యిక్కడకు వచ్చిన పందెపుఁబావురంబు నాకొసంగి నన్ను గరుణింపఁగోరుచున్నవాఁడ.

చిత్రాం—(తనలో) అక్కటా! యింత సుందరునియెడల నిట్టినిర్వికారచిత్తంబును ఘటించిన విధినేమందును? అనురాగమేదురంబులగు నాచూపు గోపులబారింబడియు నితండు సర్వపురుషసాధారణంబగు చిత్తచాంచల్యమున కించుకయు గుఱియైనట్లు తోఁచదు, కానిమ్ము! ఇంతమాత్రమునకే విరమింపఁగూడదు. (ప్ర) రాకుమారా! ఈసింహాసనము నలంకరింపుము. పిదప నీయభిమతంబు సమకూర్చెద.

సారం—అమ్మా! కూర్చుండుటకాదు త్వరగాఁ బోవలయును.

చిత్రాం—ఎక్కడకు?

సారం—జయసేనుని కడకు.

చిత్రాం—(చిరునవ్వుతో) జయసేనుఁ డెవరు?

సారం—అతఁడు మాళవరాజ నందనుఁడు నాతోఁ బావురపుఁ బందెమునకు వచ్చినాఁడు. ఇక్కడకు వచ్చిన పావుర మతనిది.

చిత్రాం—పావురముల యాటయందు దస్సితివి. ఒక్కింతకాల మిక్కడ విశ్రమించి

నేనొసఁగు మధురపదార్థంబులను భుజించిపొమ్మా. తాళవృంతముతో విసరుదునా?

సారం—అమ్మా! నీకరుణ పరిపూర్ణంబుగ నాపయినుండ నాకు నొకకొఱంత గల్గునా? మధురపదార్థంబులను వేఱే యియ్యనక్కఱలేదు తృప్తినొందితిని. తల్లివి నీవు నాకింత గౌరవము చేయవలయునా?

చిత్రాం—నీవు నాత్మజుండవు గదా నాకును నాతోడివారికిని నాథుని తరువాత నాథుని యంతటివాఁడవు.

సారం—(తనలో) ఏలయిటు వాకొనుచున్నది? ఈమె హృదయము వేఱు కాదు గదా (యోజించి) కాదుకాదు. శబ్దంబుల బహ్వర్థదోషం బీమెయం దారోపించుట నాజ్ఞానహీనతయే. (ప్ర) తల్లీ! నేను బోవకతీరదు. జయసేనుఁడు నారాకకై యెదురు చూచుచుండును

చిత్రాం—సారంగధరుని రాక కెదురుచూడని వారెవరు? మీతండ్రిగారివలె నొక్క ముహూర్తకాలమిచ్చట విశ్రమింపరాదా? కూర్చుండుము.

సారం—(తనలో) అనవసరంబున శ్లేషవాక్యంబు లుప్పతిల్లుచున్నవి. ఈమె హృదయమేదో యొకవిధముగానున్నట్లు ముఖవికాసంబు గానుపించుచున్నది. (యోజించి) కాదు కాదు. తద్దోషంబు సుబుద్ధిపలికిన పలుకులయందలిది గాని యీమె ముఖవికాసము నిర్దుష్టము (ప్ర) తల్లీ! ఇదిగో కూర్చుండుచున్నాఁడ (కూర్చుండి) నాపాపురంబు నాకు దయచేసి యాశీర్వదించి పంపుము.

చిత్రాం—ఇంతకుము న్నాశీర్వదించిన దానిఫలితము చూచికదా తిరిగి యాశీర్వదింపవలయు. ఎవరో యన్యులవలెఁ బెద్ద రాచకొమరుఁడవయ్యుఁ బ్రతివాక్యంబున మొదట "నమ్మా, తల్లీ" యనెడు సంబోధనంబులు ప్రయోగించుట నీ కుచితమా? నీ తరుణివంటి దాననగు నాకడ నింత వినయమేల?

సారం—(తనలో) ఓహో! ఇంతకుముందునిర్దుష్టంబగు సంస్కృతభాషను వ్యర్థముగా దూషించితిని. ఇప్పుడట్లుగాక యీమె మనమే దూష్యమగునట్లు తోఁచుచున్నది. (యోజించి) అట్లనుకొనుటకు వీలులేదు. పరహృదయ మప్రత్యక్షముగదా! ఇంతకుముందనుకొనినట్లు సుబుద్ధివచనంబులే యిట్టి పిచ్చితలంపులను కలిగించుచున్నవి. (ప్ర) అమ్మా! సెలవిచ్చి పంపుము.

చిత్రాం—ఇదిగో యిచ్చితిని వెళ్ళవచ్చును (చిఱునవ్వుతో) రాజసుందరా! పావురమక్కఱలేదా?

సారం—(తనలో) ఓహో! సుబుద్ధి యుపదేశ మెంతశ్లాఘనీయము "పరేంగితజ్ఞాన

ఫలాహిబుద్ధయః" యను నంశ మతనియందే సమగ్రముగాఁ బొడకట్టుచున్నది. ఈమెచిత్తవృత్తి నిశ్చయముగా దోషదూషితము (యోజించి) తల్లియెడ నీయూహ పొడకట్టుట కొంత నా తెలివితక్కువయే (ప్ర) తల్లీ! పావుర మెక్కడనున్నది.

చిత్రాం—(తనలో) ఈమిషచేత నితనిం గేళీమందిరమునకుం గొనిపోయెదను. అచ్చట నాచేత నగునన్ని పాటులుపడి మనోరథంబు నెరవేర్చుకొనియెద (ప్ర) అదిగో! మన పడకటింటిలో నున్నది.

సారం—(తనలో) మొదటినుండియు విపరీతముగానే మాటలాడుచున్నది సుబుద్ధి చెప్పినట్లు లీమెకు దురుద్దేశమే లేనియెడల నిట్లేలయాడును (యోజించి) ఆడినంత మాత్రముననే తల్లికిఁ గొడుకునందు భేదవృత్తియున్నదని తలంప వచ్చునా? ఆ భేదవృత్తియుం దిట్లు భాషించెదువారు లేరా? ఆహా! సుబుద్ధివాక్యంబులు నాహృదయంబున నెట్టి చెడ్డతలంపులను గలిగించుచున్నవి. (ప్ర) అమ్మా! దయచేసి నివే తెచ్చి యిచ్చెదవా?

చిత్రాం—నాశయ్యాగృహంబులోపలకుం బోవుటకు నీ కేమయిన సంశయమా! నీ శయ్యాగృహమే యనుకొనుము ఇందు నీది కానిదేది.

సారం—(తనలో) వెదకుదమన్న వేఱుతలంపులేని పలుకొక్కటి యయినను గానరాకున్నది. తల్లిగదా యని నేను వెఱ్ఱియూహను బడుచుంటినిగాని యీమె చిత్తంబు ముమ్మాటికి దోషాయత్తమె (యోజించి) సీ! సారంగధరా! దయ్యమున్నదన శిలలు రువ్వినది యన్నటుల సుబుద్ధివాక్యంబులు దురుపదేశంబుగా గట్టిగా ముడివేసికొని యెందును వినియుఁ గనియు నెఱుంగని తలంపులను దలపోయుచుంటివా? చాలుఁ జాలు మానుము (ప్ర) మంచిది (అని లోనికిఁబోయి నలుదిక్కులుపరికించి తనలో) ఇందెక్కడను బావురము గానరాకున్నది. నాకన్నులకు గోచరముగాక యుండెనా? నాకేమయిన మతిభ్రమగలిగెనా? కాదు కాదు మాయమ్మ మొదటనుండియు శ్లేషగానే పలుకుచున్నది. అందుచేత నిదియామె పన్నుగడయని తోఁచుచున్నది

చ. కలగవ మున్న దచ్చటను గైకొని పొమ్మని కైతవంబునం
బలుకుచు సెజ్జగీమునకుఁ బంపెగదా యిఁక నిట్టి వెన్నిమా
యలు పచరించునో హృదయమా హితుఁ డాడినపల్కు వేదపుం!
బలుకననయ్యె నైన ధృతిఁబాయుచుఁ బాపపుఁబోకఁ బోకుమా.

బామనన్నునకు బుద్ధిచెప్పుకొనుట కామెమాత్ర మెట్టి కట్టిడిపని కొడిగట్టునా? ఇంకను జూచెదనుగాక (నలుదిక్కులుం జూచుచుండఁ జిత్రాంగి లోపలకుఁ బోవును.)

మనో—అమ్మా! పంజరము తలుపు తెఱచియున్నది. మూయుటకుఁ బోవుచున్నాను.

చిత్రాం—(తనలో) ఇతని కిందలి శృంగారపటంబులను జూపి వలపు పుట్టునట్లు చేసెద (ప్ర) సారంగధరా! దిక్కులను ఖరికించుచున్నావు ఇందలి చిత్రపటంబులను జూచుటకాదేమి? చూచితివా యీసరస్వతీ పటంబును?

చ. మొదల మొదవించు నీదు నునుమోవుల నాల్గిటి నేకకాలమం
దుఁ దమక మంతఁదీఱ వడి నొక్కుచు నందలితేనె గ్రోల నా
కు దయను నాల్గుమోములనుగూర్చకపోయితి చాలు సృష్టినే
ర్పది యని మోమొకింత నొకయాశకుఁ ద్రిప్పెననంగ నొప్పెడిన్.

సారం—(తనలో) ఇంకను నుబుద్ధిమాటలయందు సంశయమేమికలదు. అయిననేమాయె పతివ్రతాశిరోమణులగు సీతాద్రౌపద్యాదుల దివ్యపటంబులనుజూపెద. అప్పటిక యిన నీబుద్ధి విడువకుందువా? (ప్ర) అమ్మా! ఈపటమునందలి ద్రౌపదినిఁగనుము.

చ. తలఁపక వావి సైంధవుఁడు తన్నుఁ బురంధ్రిని మారుకేళికిన్
బిలువఁగ సోదరా! తగునె పెద్దలు మెత్తురె నవ్విపోరె మీ
చెలియలఁగానె ముందలనుసిల్గును గనవె స్త్రీలు సెప్పఁగా
వలదను నె బుద్ధినీకని చివాట్లను బెట్టెడుభంగి నొప్పెడున్.

చిత్రాం—(తనలో) ఇతఁడు మతియొకత్రోవలోనికిఁ దిరుగుచున్నాఁడు. కానిమ్ము. (ప్ర) సారంగధరా)

చ. తలపనాత్రి విరాళిఁ బోకనడి నుంతన్విప్ప భర్గుం డుమా
లలనారత్నము కోర్కె తీర్చు మగటన్ లజ్జించి కల్దోయిఁ గ
న్నుల రెండింటిని మూయ ఫాలి పయి కన్ను న్విప్పి చూడంగఁ జే
తులు మూఁడుండమిఁ జిన్నబుచ్చుకొను నీదుర్గన్వాలోకింపుమా.

సారం—తల్లీ! పురంధ్రీమతల్లీ!

ఉ. ప్రాణము పోకినాయనుచు భగ్నుడద్గము నేయకుంటి రే
జేని నుపేక్ష నేయుదునె యిట్లు పరాంగనఁ గాంచి కన్నులన్
గానక వేఁడి చెడ్డదశకంటు నెఱుంగవె? పోయెఁ నేఁడ! నీ
మానుసు నీతలంపనెడు మానిని నీ దమయంతిఁ జూచితే.

చిత్రాం—సారఁగధరా! వదనజిత సారంగధరా!

ఆ. కౌఁగిలింప బిగ్గఁ గౌఁగిలించుకొనుచు ముద్దుఁగొనఁగ మారు ముద్దుఁగొనుచుఁ
జెక్కునొక్కఁదలఁ జెక్కునొక్కుచుఁ జెల్లి! నాబుణమ్మని నవ్వునాతిగం టె

సారం—మాతా ! సద్గుణసమేతా !

చ. పరసను భర్తలేనితతి సంబర మొందుచుఁ దస్కరించి నీ
పురమును జేర్చినావు శిఖిఁబూనికఁ గొంగునఁగట్టినట్లు సో
దరిగలవాఁడు చేయుచెయిదంబులె యివ్విని మూఢ పంక్తికిం
ధర నినుఁజూడఁ బాపమును ధాత్రితనూభవఁ గాంచియుంటిఁగా.

చిత్రాం—రాజశశాంకా ! ఇంక నొక్క గొప్పవిశేషం బిక్కడనున్నది. దీనిని నేత్రము
కనులపండువుగాఁ జూడుము. ఈపటమునందలి కాంత,

చ. జనసుతరూపమందుశశి చంద్రమణంబున హంస సుస్వరం
బున నెలమావిపైఁ బికము భోగరతి న్మదవారణంబు చుం
బనమునఁ బావురంబయి యభాగ్యత జారుఁడుగాక భర్తయ
య్యెనసెడు నాపరానివెత నెంతయు వాడెడి నంచికంతకున్.

సారం—అమ్మా ! ఈపటమునందలి ప్రోషితభర్తృక.

చ. రతమగు బొట్టుమాని నవరత్నవిభూషలవీడి నూతనాం
శుకముదొలంగి ముంగురుల సొంపుగ దిద్దుటలేక యున్న మొ
ల్లక నిదురన్నమాటవిడి లక్షలొసంగినఁ గంటనైనఁ గా
నక తనభర్తరాకకు దినంబును లెక్కిడుచున్న దిట్టులన్.

అమ్మా ! పావురమెక్కడ ? నేను దానినిఁ ద్వరగాఁ దీసికొని పోవలయును.
ఆలస్యము కూడదు.

చిత్రాం—ఆలస్య మొకరికి మాత్రము పనికివచ్చునా యేమి? నేనును త్వరపడుచు
న్నాను. నాయందలి ప్రేమచేఁ దుద కీపటంబును జూడుము.

గీ. ఎలమిఁ బుంభావరతికేళిఁ గృష్ణుమీఁదఁ । జౌకలించుటచే రామపత్యభావ
శ్యామఘనముపైఁ దళతళలాడునట్టి । మంజుసౌదామినీవల్లి మాడ్కినలరె.

సారం—(తనలో) ఈమె యన్నియు శృంగారపటంబులనే చూపుచున్నది. తన
యుద్యమానుకూలంబునకా యేమి? (యోజించి) కాదు కాదు. ఒక్కొకరిమనస్సున
కొక్కొకటి రుచించును. అంతియే కాని తల్లికి వేఱుతలంపు పుట్టదు. ఒక్క
వేళఁ బుట్టిన నమ్మా యని పిల్వ సహింపకుండునా ? (ప్రకాశముగా) తల్లీ! తల్లులు
బిడ్డలకుఁ జూపవలసినపటంబులా యని నేను వేఱే చెప్పవలయునా ? నీకుఁ దెలి
యని దేమి యున్నది ?

చిత్రాం—(తనలో) అయ్యో దైవమా ! నాసౌందర్యమునుమెచ్చి కొంతయు జాలి నొందఁడయ్యె. ఎన్నెన్నో పటంబులను జూపినను గంటితోనయినఁ గాంచఁడయ్యె. ఇంక నాకోరిక కొనసాగదు కాఁబోలు. (యోజించి) కొనసాగదని యింతటితో వెనుకంజ వేయఁగూడదు. సాధనానంతరంబులఁ జూచెద. (ప్ర) పోనీ సారంగధరా ! నీకు స్వప్నఫలంబు తెలియునుగదా ?

సారం—తెలిసిన?

చిత్రాం—

మ. కలఁగంటిన్సుకుమారుఁ డొక్కరుఁడు ప్రక్కంజేరి ముద్దాడి చె
క్కిలి బింబోష్ఠము తేనెలాని యలరుంగేల్దోయిచేఁ జూచుకం
బుల రెండింటిని మెల్లఁగాబుణికినన్ బుష్పాస్త్ర నారాధనం
బులఁ దేలించినయట్లు దీనికి ఫలంబుం జెప్పుమా పుత్రకా !

సారం—(తనలో) ఓహో ! తండ్రి యెంతదుర్మార్గురాలిని గైకొనియెను. కాదుకాదు నేనే దుర్మార్గుఁడను కానిచో హితునియుపదేశంబు నిరాకరింతునా? (యోజించి) ఊరక యీమెను నన్ను నిందించుకొననేల? కుమారుండను చనవు చేతనో యేమియు నెఱుంగని గోలయగుట చేతనో యడిగి యుండవచ్చు. (ప్ర) అమ్మా ! ఇట్టివి కొడుకుల నడుగవలసిన విషయంబులు కావు. కావున నిట్టి సంగతుల నింకనయినఁ గట్టిపెట్టి పక్షినిమ్మా.

చిత్రాం—ఇచ్చెదను గాని నామాట యొకటి వినవలయును.

సారం—అకార్యము కాకున్నఁ దప్పక వినియెదను.

చిత్రాం—అకార్యము వీసమయిన లేదు.

సారం—అట్లయిన సెలవిమ్మా.

చిత్రాం—ఈపద్యమున కర్థంబు చెప్పవలయును.

సారం—ఏపద్యంబునకు?

చిత్రాం—

గీ. కాయకష్టంబు నీవొందఁ గాంచఁగాల । గురునియొద్దఁ జదువు నీకుఁగూడదింక
నంచుఁ గురుదారకోర్కె మంత నేర్పు । విపులపాన్పుపై సారంగధరున కెలమి.

సారం—(తలవంచుకొనును)

చిత్రాం—తలవంచుకొనియెదవేమి? మీకులవృద్ధ గురుదారతోఁ గూడెననియా యేమి? ఇందతని తప్పేమియున్నది ! తారకోరెను; కోరినవారి యీప్సితం బొనరింపకుంట

ధర్మమూర్తి నాపతివంటివాఁడవు. కావున నీకడ దాపురము లేక నే నొకటి చెప్పెదను. అతఁడుకాఁడు నిన్నొకవనిత యభిలషించిన సమ్మతింపకుందువా ?

సారం—శివశివా! అమ్మా ! నే నేకపత్నీవ్రతుఁడనుగదా! నాచిత్తమెఱుంగక యెవ్వరభిలషింతురు ?

చిత్రాం—నిన్నొకవనిత యభిలషించెను. నవ్వులమాటకాదు.

సారం—అట్లయిన నామె నామనం బెఱుంగదనియే స్పష్టంబుగాఁ జెప్పవచ్చును.

చిత్రాం—ఆమె రూపవతి కాదని తలంపఁబోకుము. ఆమె రూపంబు వీక్షించిన మందునకయిన వలపుపుట్టి తీఱవలయును. ఆమె పుట్టిన పిదపఁ గవులు స్త్రీవర్ణనమందు శివమెత్తి యతిశయోక్తులను వ్రాయుదురను నిందను బాపికొనిరి. ఆమెను నీకొఱకే నలువ సృజించినాఁడు. అన్నిటను నీకుఁ దగినది: రూపవతి.

సారం—అమ్మా ! రూపవతియైన నేమి? కాకున్న నేమి? కనకాంగి తక్క తక్కిన తరుణులు నాకుఁ దల్లులే సుమీ !

చిత్రాం—నిన్నుఁ గోరినదియుఁ గనకాంగియే; సంశయింపవలదు. (తనలో) కనకాంగీ! నీపుణ్యమేమి? అక్కటా! యెవ్వతయో జవ్వని వలచినదనిన నిట్లు చెప్పె. ఇంకఁ బినతల్లిని నన్నొప్పుకొనునా? అందని మ్రానిపండ్లకు నాసపడించిన చందమాయె. మనోరమా ! నీపంతంబును సవతిలగా నెరవేర్చుకొంటివి నే నేవ్యర్థురాలను. సర్వవిధంబులచేత వ్యర్థురాలనే, (యోజించి) కానిమ్ము శక్తికొలఁది ప్రయత్నించెదను. మీఁదఁ గామదేవుఁ డున్నాఁడు. (ప్ర) సారంగధరా! ఆమెను జూడకపోవుటచేత నిటులాడుచున్నావు గాని నిజముగాఁ జూచినచో నిటులాడెదవా ? ఆ పొలఁతి పోలికను జెప్పెదను. నన్నుజూచి యామెను వేఱే చూడనక్కఱలేదు. ఇరువురకును భేదము రవంతియును లేమిం జేసి యామెనుజూచి నన్ననియు నన్నుఁజూచి యామెయనియు నెఱిఁగినవారే భ్రమించెదరు.

సారం—అమ్మా ! ఏలయీ యప్రకృతప్రశంస ? ఇహమా ? పరమా?

చిత్రాం—గుట్టు బయలగునని శంకింపవలదు. ఒరులకొంకఁ బడకుండ రహస్యంబును గాపాడెదను

సారం—అమ్మా ! రహస్యమని యక్రమము చేయవచ్చునా ? వినుము.

ఆ. పరుఁ డెవండు నన్ను బరికింప లేదని । తుదకుఁ దృణమెయైన దొంగిలింప
రాదు చీమ నైనఁ బ్రాణంబుఁ గొనరాదు । కర్మమునకు గుట్టొకండుగలదె.

పరమేశ్వరునకుఁ గన్నులు గప్పెదవారేమి?

ఆ. పవలు రేయి భూతపంచకంబు తరణి! చంద్రుఁడఖిలలోక సాక్షిహారుఁడు
వేయికనులతోడ వీక్షింపుచుండ ర! హాస్యమనుచు నొకటియైనఁ గలదె.

వీరి వారి మాటలెందులకు? మన మనస్సాక్షు లెట్లు సమ్మతించును.

చిత్రాం—నాయెడ నిట్లంటివి. కాని, యౌవనితయేవచ్చి యొక్కింత దరహాస చంద్రికఁ జూపిన నీమనశ్శిలకాంతమూ కరఁగకుండునా!

సారం—

చ. బలమునశించుఁ గీర్తియెడఁ బాయు ధనం బడుగంటు నెల్లబం
ధుజం తృణమట్లు జూచెదరు దుమ్మగు దాఁకఁ దొలంగుమంచు వ్యా
ధులు బడలంగఁజేయు యమదూతలు శిక్షలొనర్తు రన్యకాం
తలజతఁ గన్నఁ గావున మనంబెటులం గరగం బతివ్రతా.

చిత్రాం—నీమనస్సు కరఁగనిచో నావనితయే బలవంతపెట్టును.

సారం—బలవంతపెట్టిన నిది నీకుఁ దగదని బుద్ధిచెప్పెదను.

చిత్రాం—నీబుద్ధినకఁ గాళ్ళ వ్రేలఁబడి బతిమాలును. దేహియన నాస్తి యందువా?

సారం—అనకేమి. బతిమాలినను భయపడుచున్నాఁడను గదా!

చిత్రాం—ఎవరికి?

సారం—ఆముష్మికంబునకు.

చిత్రాం—నీతండ్రికి కాదుకదా!

సారం—అమ్మా యిట్టిమాటలేల? నామనః పరిశీలనంబునకుఁ గాబోలు నిట్టులాడుచున్నావు. కానిచో నాయట్టివారికి వేయిమందికి బుద్ధిగఱపఁ దగిన దాన విట్లుందువా? తల్లీ! తడవయ్యె.

చిత్రాం—నాకును దడవయ్యె. (తనలో) ఇంక వీనికడ ద్రావిడ ప్రాణాయామపు మాటలు పనికిరావు. గూఢమంత్రమున్నె వలనుపడదు. సిగ్గువిడిచి నోటితో స్పష్టంబుగఁ జెప్పవలయును. చెప్పిన నంగీకరింపనిచో నవమానముగదా? అవమానమని యెంతదనుక సమ్ముఖంబున రాయబారము. అయ్యో! కామభగవానుఁడా! లోని వలపు లజ్జచే నుయ్యెలలాగున నుండెడి. ఓలజ్జా! నన్ను విడిచిపొమ్ము, నన్ను విడిచి పొమ్ము. ధర్మమా! మఱియొకతావును జూచుకొనుము. అభిమానమా! మనల కిరువురకిఁక పరిహదనుమూ. మోహమా! సారంగధరుని, నన్ను రెండుకన్నులతో సమముగాఁ జూడుము. కామభగవానుఁడా ముందు నడుపుము. (ప్ర) సారంగధరా! రూపజిత సారంగధరా!

సీ. ఇంపుమీఱ నిటకేరొయెడ వత్తువో యంచుఁ దలవాకిలిల్లుగా నిలువ నిలువ
నాకుమారుఁడు వచ్చునాయని దైవజ్ఞు లందఱిఁ శకునంబు లడుగ నడుగ
నేవంక నెలుఁగైన నీవె వచ్చితివంచు బంగారుగొండంత పొంగఁబొంగ
నేకాలమునకైన నాకోర్కెయగునని బలిమిని బ్రాణముల్ నిలుప నిలుప

గీ. కాళ్ళుగుదిగట్టెఁ గాయలు గాచెనోరు । మనము దిగఁద్రుంకెనుసురిసీమయనుచువినికె
నభ్రసందర్శనమునకు నగయుబిహాఙ్ । గతినినీయాగమమునకు గాచుకొంటి.

ఇటుండ నపరూపంబుగా నేఁటికిగదా వచ్చితివి. ఎప్పుడు నీసతీ కేళీగృహం బుననే యుండవలయునా? నన్నును నీతఱిణి కరణిఁ దలఁపరాదా? ఇటు కొంచెము విశ్రమింపఁగూడదా ?

ఉ. ఎంచెదనొక్క పల్కు వచియించెదఁ గందపుఁబూఁత మేనఁ బూ
యించెదఁ జేయిచేత స్పృశియించెదఁ గప్పురవీడియంబు ని
ప్పించెద బాధలెల్ల మఱపించెదఁ గమ్మని ముద్దుసంగ బా
ర్థించెదఁ బెక్కుభంగుల నుతించెదఁ గోర్కుల వేగనించెదన్.

గీ. ఆయముఁబానిపటిక దీర్చినట్టిపసిఁడి । గదియునోరపైన పద్మరాగంబు కరణి
మూఁడుకాళ్ళ ముసలిధత్రిపిడిచేడె । చేరెనుకుమారు నభినవమూకునిన్ను.

సారం—(తనలో) శివశివా ! నేఁ డెట్టిదుర్దినము. ఉదయంబునలేచి యెవ్వరి పాను మొగంబును జూచితినో వినరానిమాటలు వినవలసివచ్చె.
ఏదియో పాపం బీరూపంబుగాఁ బరిణమించెను. (ప్రి)

చ. పతికడ లేమినిన్ విరహభావముచేత వచింపుచుంటివో
జత పెప్పుడుండువారు విరసంబుల నాడుమటంచు నేర్పిరో
యితనిమసంబున దెలియ నిష్టముగాఁగదెనో లేక నీకు దు
ర్మతి జనియించెనో తగదు మంచితలంపును దైవమిచ్చుతన్

చ. చనవలదంచు సాహితుఁడు సారసశోక్తులు పల్కి తల్లి వం
చనియిటు వచ్చినట్టి నను నాత్మజు వేఁడఁగ పాడియౌనె నా
మనము నెఱింగియున్ దగవుమాలిన బుద్ధియె యెవ్వరేగతిన్.
జనినను వారికీరీవల సాధ్వివి నీవన లోకమన్నదే.

అమ్మా ! యిది నీకుఁ దగదు.

చిత్రాం—అమ్మా యని పిల్వకు కొమ్మా యని పిల్వుము.

సారం—(చెవులుమూసికొని) శివశివా ? ఎంతదారుణ కృత్యంబున కుపక్రమించితివి?

చిత్రాం—దారుణ మేమియున్నది ? ఈపట మెవరిది ? (పటమును జూపును.)

సారం—(తెచ్చపడును.)

చిత్రాం—మాట్లాడవేమి ఈపటము నీదియగునా ? కాదా ?

సారం—అయిన.

చిత్రాం—కాఁబట్టియే వినుము.

ఉ. చక్కనిచుక్క కన్నిటను జాలుదువీవని తల్లిదండ్రు లిం
పెక్కఁగనీకొనర్పఁగ రంతిరయొ కాకిటు కాటికంధ్రుల
న్మిక్కిలిఁ జూపినట్టి యవనీపతికిచ్చిరె మాలకాకికిన్
జక్కన దొండపండు గడుమూర్ఖతచేతను గట్టుకైవడిన్.

చిన్నవానికిఁ గొత్తవలువయు ముసలివానికిఁ బడుచుజెలువయుఁ గోరికిన బులుపు కలుగును. కావున నీతండ్రికి నెట్టులుండినను భార్యయంబులో నున్న నిన్ను వరించిన నాకు శతవృద్ధు దాపరించిన నింక నాస్వాంతమెంతి సంతాపాకాంతంబుగా నుండునో యొక్కింత దయాంతరంగుండవై నీవె యోజించుకొనుము.

ఉ. అన్నులమిన్నమిన్న యిలనన్నిటవన్నెను గన్న కన్నె కొం
జిన్నెల జెన్నులన్ జెలఁగు చిన్నరి పొన్నరి వన్నెలాడి కా
నన్నయ మెన్నియెన్ని లలనన్నను మన్ననఁ గాంచి కన్నెనన్
గొన్నవవిల్తుఁజిన్నములఁ జూపుము బన్నము గిన్నమున్ జనన్.

సారం—(చెవులుమూసికొని) హరహరా ! ఎంతఘోరకృత్యంబున కొడిగట్టితివి. నిజముగా నీవిట్టు లాడితివో లేక నాకు వినఁబడియెనో గాని యేవర్ణంబునందును నిట్టి వైపరీత్యము వినలేదు.

ఉ. అమ్మవు కాదటమ్మ యిటులాడఁగఁ జెల్లునఁటమ్మ కన్న యా
యమ్మకు నీకు భేదము రవంతయు నున్నదఁటమ్మ యిట్టిప
ల్కమ్మహి విన్నమర్త్యులెవరేనియు నీయనరమ్మ పాపకా
ర్యమ్మెట్టులెంచితమ్మ మదిన్యాయముగానవఁటమ్మ యిమ్మెయిన్.

ఉ. నుతుపయిఁ బాళిగానిపని శోణితలంబునఁ జేసిపోఁబో
లి తనరు నన్నవాయము వలీమసమున్ వలుపంగనేల యా
శతధృతికన్న నీయపయశం బధికాయువు గల్గియుంట నే
శతగుణితంబుగా నతులు సల్పెదనయ్యది సేయకుంటకున్.

చిత్రాం — సారంగధరా కానిపని యేమున్నది? ఎప్పుడు నిన్నుఁ దక్క నన్యుని గోరలేదుగదా! బాగుగా పరిశీలన చేసినచో నీతండ్రిది కానిపని; ఎవరికిఁ బెఱవారు దక్క వారివారు నిర్దోషులుగాఁ గనుపింతురు. వాదమేల మదన ప్రియవరంబుల కోర్వఁజాల.

సారం — తల్లీ! మదనుని సూనబాణంబులచే నోర్వఁజాలనిదానవు ముందెట్లు దండధర ప్రచండ దండబాధల నోర్చెదవు? ముందుగతిఁ జూచుకొనవలదా? కామసంహారుం డగు హరుండు నీకీభావంబు మరల్చుఁగాక.

చిత్రాం — త్రిభువన విజయుండగు కాముండు నాతో నేకీభవించుటకు నన్నుఁ బ్రేరేపించుగాక భూతదయాపరా! సారంగధరా!

చ. పరులెవరైన నొక్కరుని బాధను బెట్టఁగ వాఁడు వేఁడుగా
శరణము లేమి భూవరుని సన్నిధిఁ జేరును గాదె యట్లు నీ
సునను కేంతి స్తనము మసాయంచఁ డేఁచగ రాకుమార యీ
సరసిజనేత్రి బాహువుల సందిటఁ జేర్చను గ్లాని దీర్పుమా.

సారం — అమ్మా! నీకిట్టిబుద్ధి పుట్టుటయే తప్పు. పుట్టిన నమ్మాయని పిల్చి నింక నడుగకుంట నింతక్కు గొప్పతప్పు. కాముంబులే యుక్తిరబస్సుప్పు. డింకఁ బ్రాయంబు నా వినుము.

చ. జననము లోనఁగల్గ దమసానము వాఁకను విల్వఁబోఁడు జ
వ్వనముల చంచలాలతిక వంటిది దానినినమ్మి పాపపుం
బనులొనరింప మీఁద యమబాధలనొందక తల్లి మీదటుం
గని మనుజాళికిం దదకుఁ గానగ గాని విపత్తులౌఁగదా.

పతిపనితా సంగమంబె దూష్యంబని పెద్దలు విధింప జననియగు నీవు నన్నట్టిపనికిఁ బ్రేరేపించుట యెట్టి బాడియో తలంపుము. ఒకరిచేతఁ జెప్పించుకోవలసిన దానవా?

చిత్రాం — ఔరా! సారంగధరా తండ్రిచేఁ బాలింపఁబడిన ధరారమణి రమణిని గాఁ గైకొను రాచకులంబు వారికి దెవ్వొప్పా? ఈ శీరంగనీతులను ఎక్కడ నేర్చితివి? మున్నె పెద్దలు వృద్ధియల నుద్దులకు లోఁబడియుండలేదు?

సీ. పఱదండ్రి నిరువురఁ మఱకేళిఁ గదిసిన వ్యాసుఁడు కేపాటి వాసిపోయె
సారం — గౌతమజాయను గాంక్షించి శక్రుండు నిలువెల్ల వేయికన్నులను బొందె
చిత్రాం — గురుదార తారతోఁ గూటమిఁ జెందిన వనజారి కేపాటి వన్నె దగ్గె
సారం — శచిఁ గోరి నహుషుండు సత్తపోధనుచే స్వారాజ్యమును వీడి భ్రష్టుఁడయ్యె
చిత్రాం — పుత్రియైపాలుపొందు బ్రహ్మ బోడిగూడిన వాక్పతి కేపాటి వన్నె వాసె

సారం — పాంచాలరాజాత్మభవఁగోరి కీచకుఁడాశుగాత్మజుచేత నంతమొందె

చిత్రాం — మేనత్తయైనట్టి మెలఁతతోఁ గలిసిన కృష్ణునకేపాటి కీర్తి తొలఁగె

సారం — వసుమతీజాత రావణుఁడు వేఁడ సపుత్రమిత్రముగాఁ దాను ధాత్రిఁ గూలె.

చిత్రాం —

గీ. వారు నీపాటి తెలియని వారెతులన । యుండఁబోఁడిపడుచుటుల నొకరికెన్ని
   రైన నీతులం బల్కెదరంతె కాని । వనితల వలలోనఁ బడనివారు గలరె !

సారం —

గీ. తెలిసిరో తెలియకో కోరి కేళిమానిపొడి । పదవి వీడి వచ్చి యొకరి ప్రాణములను
   గూడఁ దీసికొందును బాపుకొన్నవారు । లేరు గాన నిదివలదు పైకికైన.

చిత్రాం — (తనలో) ఇంక వీనితో వాదువీని చెప్పిన లాభములేదు దేహి యని
   యడిగెదనుగాక. (ప్ర)

మ. కరుణన్ ముద్దుల ముద్దులన్ బిలువుగాఁ గౌఁగిళ్ళ రక్షింతొ యా
   సరసీజాక్షుఁగ కీసికీలలను నేఁ జావంగ వీక్షింతొ సుం
   దర నీచిత్తము నాదుభాగ్యమిఁక వాదంబేల నేనన్యథా
   శరణంబొల్లను స్త్రీయటంచుఁ జేరితిని మాం సంరక్షయం చిట్టులన్,
      శరణాగతరక్షణంబు రాజులకుఁ బరమధర్మంబుగదా !

సారం — (తిచ్చపడును)

చిత్రాం — ఏమియూరకుంటివి నిరుత్తరం బంగీకారసూచకంబా ?

సారం — నీవు తల్లివి నేను బుత్త్రుఁడను. మానవధర్మంబు బరిత్యజించి పశుధర్మంబు
   నవలంబించి విన్నంతనే యెట్టివారికయిన నసహ్యంబును బుట్టించు నిట్టి నీచపుం
   బనికిఁ దొడఁగితివని నిశ్చేష్టుండనై యుంటిని గాని మఱియొండుగాదు.

చిత్రాం — మానినీమదనా! కన్నులు గలిగినందులకుఁ గాంచవలసిన భాగ్యంబు నీరూపం
   బును గాంచి కాంచితిని, నాతనువు గలిగినందులకు నిన్నొకసారి గాఢాశ్లేషం బొన
   రింపవలయునని తత్తరపడుచున్నాను. ముందొక్కసారి యని యడిగి తలయూపిన
   తరువాత మఱియొక్కసారి యని కోపరెద ననుకొనియెద వేమో అటుల కోపరను.
   చేతిలోఁ జేయి వేసెదను. (అని చేయి వేయఁబోవును.)

సార — తల్లీ నన్ను ముట్టకుము పదివేలవందనంబులు.

చిత్రాం — నీయెట్టిసిరులు నాయట్టి నెలంతలకు నెయ్యంపు జగడంబులయందుఁ గదా
   యభివాదము నొనరింపవలయును. ఊరక యిప్పుడట్టి యుపచారమేల?

సారం—రామరామ.

చిత్రాం—(సమీపించును)

సారం—అమ్మా! నాచెంతకు మరింత వచ్చెదవేల!

చిత్రాం—పిలిచితివికదా.

సారం—ఎవరిని?

చిత్రాం—నన్ను.

సారం—ఎప్పుడు?

చిత్రాం—ఇప్పుడే.

సారం—ఏమని?

చిత్రాం—రామరామా యని.

సారం—నీయూహనుబట్టి యట్టియర్థంబును జేసికొంటివి గాని నాయభిప్రాయము కాదు. నీవాడినపలుకులు బెడిదంపు ములుకులవలెఁ దోఁప నప్పరమేశ్వర నామోచ్చారణంబును జేసితిని. (తనలో) హా! సుబుద్ధీ! నీవెన్ని యక్షరములు చెప్పితివో యన్నియు నిజమయ్యె. నీమాటవిన్న నాకిట్టిపాటొదవదుగదా! (ప్ర) తల్లీ! అది యేమి కాలవిశేషమోకాని కలిగినకంటికిదీపము పనికిరానియట్లు సద్బోధనలన్నియు నీకుఁ బనికి రాకయుండెను. ఉత్తమరాజ వంశంబునఁ బుట్టి యశోవిరాజితుండగు నాజనకుని చేపట్టి యీఁడువారిలో నింతదనుక నవునని యనిపించుకొని నాయట్టి వాండ్రకు వేవురకు బుద్ధి చెప్పఁదగినట్టి నీవివియన్నియు మంటఁ బెట్టి నడుముకట్టి వ్రేలు చూపించుకొనియెదవా!

చిత్రాం—(తనలో) ఇంక నితనికడ సామవచనంబులు పనికిరావు. ఇష్టమువచ్చినట్లు దూరెదను. పెట్టువానికన్నఁ గొట్టువాఁడెక్కువఁగదా (ప్ర) ఓరి కఠినహృదయా! కుశేశయశిరీష కుసుమంబు కన్నఁ బేశల మగు శరీరంబునకు లోహవజ్రంబులకన్నఁ గాఠిన్యంబగు చిత్త మెట్లు దాపరించినది? నీవొక వికలాంగుఁడ వయినను నాయట్టి యబలకింత చింత కలుగదుకదా.

ఉ. చేడకుఁ బ్రాణదానమును జేసినఁదప్పక మంచి పేరుచే
కూడును గాక ప్రాణములఁ గొంకతిసితివేని యెప్పుడీ
యేడుజగంబులందు ఖలుఁడీతఁడటందురు గాన రెంటిలో
బాడి యెదో తలంపుము స్వభావమునన్ గుణమున్ గ్రహింపవే.

గ్రహింపనిచో నేను బ్రాణపరిత్యాగంబును జేసికొనెద. తద్దోషంబు నీకు సంభవించును.

సారం—

చ. పలువురు దూఱు కార్యమును బల్కి యొనర్పక పోయి లేని సీ
వలపునఁ జేసి ప్రాణములఁ బాసెదఁ బాపము వచ్చుదాన భూ
తలమున నంచుఁ బల్కెదవు ధర్మవిరుద్ధము లైన ధర్మముల్
సలుపఁగరాదు గానఁ గష్టం బణుమాత్రము గల్గ దెప్పుడున్.

చిత్రాం—ఏమిరా! నిర్దయస్వాంతా! నేనెంత వేఁడిన నణుమాత్రంబయిన నీమనసు కరఁగకున్నది. నీహృదయమును వజ్రముచేతనో లోహముచేతనో శిలచేతనో చేసి యుండవచ్చు కాకున్నఁ గన్నీరు మున్నీరుగా విలపించుచుండఁ గటిక కిరాతుండయిన నను జాలిఁగొనఁడా? ఎన్నియో చదివితివి. నీచదువులు సముద్రంబులోఁ గల్పవా? మంటపెట్టి కాల్పవా? భూతదయయన్న నెట్టిదియో యెఱుంగని చదువులేల? ఆఁడుది యుసురుమన్నఁ బాతకము గాదఁటరా.

సారం—అమ్మా! ఇంకను నీతలంపు పుడుగవా? ఇది తగవు కాదు.

చిత్రాం—(తనలో) వీని నెంత నిందించినను లాభము లేకపోయె పోనిమ్ము, బెదరించి చూచెదను. (ప్రకాశముగా) ఓరా! యిట్టిధర్మపన్నా లుగ్గడించుచున్నావు. కొలఁది కాలము కాచుకొనుము. మీతండ్రిగారు వచ్చినతరువాత నీపాట్లు (అర్ధోక్తిలో)

సారం—

చ. జననివి నీవు పల్కిన వచస్సులు మీఱఁగరాదుగాని కూ
డనిపనియాట మీఱితి మాతంబును బూనకు మంచు వేఁడినన్
గనుమిఁక నీదుపాటనుచుఁ గన్నుల నప్పుదరింతు వేల నా
జనకునితోడ లేనిసడి చాటిన నాయన విశ్వసించునే.

చిత్రాం—విశ్వసింపకేమి?

ఆ. ఈశరీరమునకు నెవ్వాఁడు కారణ। భూతుఁడో యతండె నీతిఁదప్పి
నిన్ను విశ్వసించి నన్ను దండించిన। నతని తనువు నతని కపుడె యిత్తు.

చిత్రాం—వృథాగాఁ బ్రాణంబుల నేల కోల్పోయెదవు. నామాట వినుము.

సారం—తల్లీ! అధర్మంబు కావున నెట్లువిందును.

చిత్రాం—మరణంబు పట్టున నధర్మమయిన నేమి? గ్రాహ్యము కాదా?

సారం—కాదు.

చ. పలువురు గాంచి నీయనెడు పాపపుఁ గార్యము చేసి ధాత్రిలో
పలశతవర్షముల్ బ్రతుకు పాతకికన్నను మంచి సేతలన్

సలుపుచు నల్పకాలమునఁ జచ్చినవాఁడధికుండు గాననే
బలిమినిఁబ్రాణమైన విడువంగ సహింతును వీడ ధర్మమున్.

చిత్రాం — నీకీపుడమిపై ఋణము తీరినది. కాఁబట్టియే నామాట వినకుంటివి. ఇంతంత నరాని వంతలను బెట్టెదను ఎవరనుకొంటివో.

సారం — అమ్మా! నీవెట్టు చెట్టఁబెట్టెదవు వినుము.

చ. తనయుఁడు నూతిలోఁబడినఁ దద్దయుఁజింతను గాళ్ళుతొట్రిలన్
జనిపడి దానునున్ దుమికి సాహసమొప్పఁగఁ దేల్చుతండ్రి చా
డ్పున విపదంబుధిన్ మునుఁగు పూరుషు సాకెడు నీశ్వరుండు నె
మ్మనమున నెన్నఁడేని ఋజుమార్గము వీడని నన్నుఁ గావఁడే.

చిత్రాం — ఆదేవుఁడే నీకీబుద్ధినిఁ బుట్టించుఁగాక. సారంగధరా! నాయాశనంతయునాశనంబును జేసెదవా? నీవు నామాటను గాదనవనియెంచి చానలకుందు సహజమయిన గుట్టువిడిచి బట్టబయలుగాఁ జెప్పితిని. మనమేకాంతంబుగా నుండనిచో నీసంగతి రాద్ధాంత మగునుగాఁబోలు? ఎంత తప్పొనరించితి.

సారం — అమ్మా! ఇది నీతప్పుగాదు. నాపాపపరిపాకంబున నిట్టిమాటలు నీనోటనుండి వినవలసివచ్చెను. ఈ సమాచారంబు వెల్లడియగునని భయంపడవలదు వినుము

ఉ. పాతకుఁడంచుఁ బల్వురు చివాట్లను బెట్టినఁ బెట్టనిమ్ము కా
ళ్సేతులు దుర్గమోగ్రవనసీమను బోయినఁ బోవనిమ్ము నే
నేతతి నేరితోడ నిది యిట్లని చెప్పను నీదుపాదకం
జాతముతోడు తల్లికి విచారము నిందను కూర్చుటొప్పునే.

(తనలో) పావురంబునకై జయసేను నేదో యొకవిధముగా బతిమాలవచ్చుగాని యింక నీమెచెంత నుండఁగూడదు. త్వరగాఁ బోవుటయే యుక్తము.

(అని పోవుచుండును.)

చిత్రాం — (పయివలువను దీసికొని) చిక్కితివి; ఈగురుతెంతకుఁ జాలదు. నాయనురు నీకుఁ దవులక మానునా?

సారం — అమ్మా! నాకడసారి ప్రార్థనము నాలకింపుము.

మ. ఘనపారావతరాజమున్ వలువయున్ గారుణ్యభావంబునన్
గని నాకిప్పుడొసంగితేనిఁ గొనెదన్ గాకీయవైతేని వం

దనముల్ గైకొని యాజ్ఞనిమ్ము చనెదఁ దైవంబు మూందేగతిఁ
ననువీక్షింపఁగ నెంచునో తలఁపఁగ న్నావార్తయెట్లున్నదో.

చిత్రాం.—నీవార్త బాగుగానే యున్నది. నానాథుండు లేనప్పు డవరోధంబు చేతెంచి నీవుపడినపాట్లకుఁ బ్రతిఫలము వెంటనే పొందెదవు. ఛీ! దుర్మార్గా! నీ కపకారమ్ము చేయింపకున్న నేను చిత్రాంగినా?

సారం.—ఎంతసాహస మెంతసాహసము. అయిన నేమి?

సీ. హారధాతదుగ్ధసాగర సుతాపతులార! సర్వంసహాంతరిక్షంబులార!
నళినాప్తయామినీ నాథతారకలార! వాసవప్రముఖ దిక్పాలులార!
సురయక్షకిన్నర గరుడపన్నగులార! నారదముఖజటాధారులార!
పుణ్యనదీనదభూమీధరములార! దినవారమాసహాయనములార!

గీ. ధర్మమేది యీసారంగధరుఁడుతప్పు। దారిఁజనినవాఁడేని భూధవునితోడ
నదియు నిదియుఁ గల్పించి పిన్నమ్మపల్కు। జిహ్వారాకుండఁజేయుఁడీ శిరము వంతు.

చిత్రా.—వీరండఱు నిగ్రహానుగ్రహ సమర్థులా? వీరు ధర్మవర్తనులు కాఁబట్టి కాఁబోలు నిన్ను వరించిన నాకు ముదుకండగుమగండు సంభవించెను. అప్పుడు వీరేమూలల దాఁగినారో? ఇప్పుడుమాత్రము తగుదుమని సిగ్గులేక తలలెత్తి యెట్లు వచ్చెదరో నేనును జూచెద గాక.

సారం.—(తనలో) మిత్రమా! సుబుద్ధీ! నీవు నిజముగా సుబుద్ధివే. నీమాటవిన్న నాకీ యాపద రాదుగదా! ఇట్టికష్టంబు నేనుగాంచుచుండగా మాపినతల్లి మనంబు నద్దములోఁ జూచినట్లు చెప్ప నీవాక్యంబు లేలవిందును? దిగినఁ గదా లోతు తెలియుటని

సీ. దరిలేని దుఃఖసాగరమును దాటంగ యానపాత్రము గాదె యాప్తుమాట
సకలకార్యవిధాన సంతానమును జూప నమలాంజనము కాదె యాప్తుమాట
భద్రపరంపరాప్రాసాదమును నెక్క నారోహణము కాదె యాప్తుమాట
కామాదిరిపుశైల ఘనగర్వమును బాప ప్రహరిణియగు కాదె యాప్తుమాట.

గీ. అలమనోరథబీజంబులంకురింప। నమృతవర్షపాతము గాదె యాప్తుమాట
అట్టియాప్తుమాట విడిచినట్టి నాకు। నిట్టిచెట్టలు గాక మఱెట్టివగును.

విచారించిన నేమిఫలము ఏగెదను గాక. (నిష్క్రమించును.)

చిత్రా.—ఇంతదనుక నెప్పుడితఁడు వచ్చునాయని కొండంత యాశతో నుంటిని.

వేఁటితో సంతసించెదనుగదా! ఇఁక నా సఖి మనోరమ మోము నెట్లు గాంతును? కాంచకేమి? సఖీ! మనోరమా!

మనో—(ప్రవేశించి) అమ్మా! విచారముగా నుంటివి. నీ మనోభిలాషంబు నెరవేర లేదా యేమి? నావీనుల నమృతము పోసెదవా? విషముఁబోసెదవా?

చిత్రాం—మందభాగ్యలకమృతమా? వాఁడు రాతిగుండె గలవాఁడుగదా? ఎన్నిమాయలు చేసిన నవియన్నియు నిష్ఫలంబులయ్యె. ఎంతబతిమాలిన నావంతయు దయఁబూనఁడయ్యె. నిందించినను లాభములేకపోయె. నరకముల భయంబు బెట్టిన నణుమాత్రము ధృతివీడఁడయ్యె. ముందేయుపాయంబు తోఁచదు. ఈ పాయమేటికి? వాని మూలాన బలవంతముగాఁ జచ్చునంత రోగంబొదవె. ఇంతదనుక వాఁడు వచ్చి నన్నలరించునని కోరికయూపిరితో నుంటిని. ఇప్పుడదికూడఁ ద్రుంగ పీడవలసివచ్చె.

మనో—అమ్మా! నీ మాటయు వినలేదా? ఎంతద్రోహి!

చిత్రాం—అయిననేమి? వీఁడిఁక బ్రతికి బట్ట గట్టునా?

మనో—ఇట్టి ముష్కరులు బ్రతుకకేమి?

చిత్రాం—బ్రతుకువాఁడైన నామాటేల యంగీకరింపఁడు? నా ధవుఁడు వచ్చిన తరువాత జూడుము.

మనో—ఏమిచేసెదవు?

చిత్రాం—వానిచే బలవంతము బలుపఁబడినదానివలె నుండెద నేఁడు నాథుండు వచ్చునని వింటిని. వచ్చుసమయంబయినది నే నీ గది తలుపులు మూసి యేడ్చుచు నేమియుఁ జెప్పనిదానివలె నెన్నెన్నో మాయలు చెప్పెదను. నీవును సమయము వచ్చినప్పుడు తోడుపడవలయును.

మనో—ఆసంగతి నాకు వేరె చెప్పవలయునా? సారంగధరునియందే దోషమున్నదని కోటి బొంకులయిన బొంకెదను. (ఆలించి) కాలిచప్పుడు వినవచ్చుచున్నది. రాజుగారే యయియుండవచ్చును. నేను బోయెదను. నీవు నీ ప్రయత్నంబున నుండుము.

(నిష్క్రమించును.)

చిత్రాం—గది తలుపులు వేసికొని పండుకొని మొట్టమొదట నా నాథునికయి పరితపించియుఁ బిదప నతనివి సారంగధరునిగాఁ బయికిఁ బెంచి యనంగీకారమున జీవాట్లను బెట్టియు టంక మతికిఁనట్లు బొంకెదను. (అని తలుపులు వేసి పండుకొనును.)

రాజు—(ప్రవేశించి) ఎన్నిదినములకు నా సుందరి సుందర మందిరంబుఁ గాంచి యానంద మొందఁగలిగితిని. ఇప్పుడుగదా నా వేటయందలి శ్రమ యంతయుఁ దీఱినది. ఎట్టి

సుఖంబులయినను పారసాక్షి పరసనున్నప్పుడే యవి సుఖంబుగాని లేనిచో నవి వేయి యయినను దుఃఖంబులుగానే పరిణమించును. ఈమాటలతోఁ గాలహరణ మగుచున్నది. వీనితోఁ బ్రయోజనమేమి? నాసఖి ముఖచంద్రునిఁ జూచి మదన మోహాంధ కారంబున బాపుకొనియెదఁ గాక! (ముందునకు నడచి విస్మయముతో) ఏమి! యీహర్మ్యరాజ్యము వెలవెలఁ బాఱుచున్నది. కారణం బేమియయియుండ వచ్చును? ఇక్కడ లెక్కలొక్క చెలికత్తెయయినను గానరాకున్నది.

సీ. ఎపుడు గాంచిన వీణ నింపుగా వాయించు వాయింపదేలొకో వనితయిపుడు
ఎపుడు గాంచినఁ జిల్కఁ గృపతోడఁ బలికించుఁ బలికింపదేలొకో కలికి యిపుడు
ఎపుడు గాంచిన నెమ్మి నెంతేని నాడించు నాడింపదేలొకో యతివ యిపుడు
ఎపుడు గాంచిన నంచ నెలమి నడపించు నడపింపదేలొకో నాతి యిపుడు

గీ. ఎపుడు గాంచిన నారాక కెదురుచూచు। చుండుఁ దాఁ జూడదేలొకో యువిదయిపుడు
తొంటిచందాన నీమేడ తోఁచదేమి। కారణం బేదియో నాకుఁ గానరాదు.

నాప్రియురాలు మున్నెన్నఁడు నా కాలిచప్పుడు వినినంతమాత్రముననే మొగ మింతో చేసుకొని నాపాలికి మదనరాజ్యలక్ష్మియోయన నేతెంచుచుండు. ఇప్పుడు రాకుండుటకుఁ గతంబేమి? హాస్యంబునకయి యొందేని దాగియుండెఁ గాఁబోలు. వెదకిచూచెదను. (దిక్కులన్నిచూచి) ఎచ్చటఁ జూచినను గనుపింపకున్నది.

క. ఏదీ నావలపుల నెల। యేదీ నా ముద్దుగుమ్మ యేదీ ప్రాణం
బేదీ ప్రమోదమూలం। బేదీ చిత్రాంగి రాణి యేదీ యేదీ.

మత్త. కాంత గానఁగ రావు మేడను గాన నాయెడఁ బూనితో
మంతమూనుచు నన్ను వంతల పాలుసేయఁగ దాఁగితో
కంతుఁ డేసెడు బాణజాలము కారుచిచ్చు విధాన న
న్నంతకంతకు వ్రేల్చుచున్నది యాదరింపుచుఁ బ్రోవుమా.

చ. మనము నెఱుంగఁ గొంచి పలుమాయల దాఁగుడు మూఁతలాడెదో
వనజశరుండు బాణముల వైవఁగ మేనరికంబు లాడెదో
వనజదళాక్షి నీకుఁ బగవాఁడనొ దాసునియందుఁ దప్పుగాం
చినయెడ దాని వ్రేల్మడచి చెప్పుమ లెక్కకు నొక్కటేనియున్.

తప్పులకేమి? వేయుగాఁ జెప్పవలయునా? ఒంటిగా నిన్నిక్కడ డించి విపినంబు ఏగిన తప్పుకన్న గొప్పతప్పొకటిగలదా? అందులకా యలుకను బూనితివి.

చ. అలుకను వీడవే వరముఖాంబురుహంబును నెత్తిచూడవే
వలపునఁ జీరవే హృదయపద్మమురంజిల ముద్దుఁబెట్టవే
పలుకుచుఁ బల్కవే యలరుఁగోలలకోర్వల నెల్లమున్నవే
సలిపినయట్టితప్పుఁ గృపసైపుము చేతులనెత్తి మ్రొక్కెదన్.

ఒకవేళ నీ మ్రొక్కుతో నీయాగ్రహము దీఱకున్న నే శిక్షనయిన విధించి నన్ను నీ యనుగ్రహపాత్రునిఁగాఁ జేయుము.

మ. స్ఫటికంబంచున బద్మరాగమువలెన్ సొంపైనచెక్కిళ్ళపైఁ
బటుతాంబూల రసంపుముద్ర నొనరింపన్ జూతు సందీని కౌఁ
గిటఁ నొక్కంగను జూతు జంభఫలభంగిన్ జేతనాడింపు మీ
నటులాడించెద పట్టులాడెదను నారీ జంత్రపుం బొమ్మగాన్.

చిత్రాం—(తనలో) ఇంతమోహంబుగలిగిన మనోహరుం డేదిచెప్పిన విశ్వసింపఁడు? అంత తొందరగాఁ జెప్పనేల? వినిదాకకై నేను జింతించుచున్నట్లు నటించెద.

చ. సుమశరరూప వక్త్రజితసోమ మనోభవ యిట్టులైన ప్రా
ణములను నీయెడన్నిలిపి నాళులు వ్రేళులమీఁద నెన్నుచున్
నిమిషము వత్సరంబువలె నే దురపిల్లఁగ రావదేమి వ్యా
ఘ్రముఖమృగాళి మ్రింగెనొ కిరాతులు గొంతునుగోసి చంపిరో.

రాజ—(ఆలకించి తనలో) స్వరముయొక్క వైఖరిఁ జూడఁగా నాసతిదిగానే యున్నది. సమీపంబునన్న యీమందిరంబున గవాటము వేసికొనియున్నది, గవాక్షమార్గంబున జూచెద. (చూచి ప్రకాశముగా)

గీ. సాంద్రజలధరాచ్ఛాదిత చంద్రువోలె । శైవలాంతర్గత సలిలజంబు రీతిఁ
బత్త్రసంచయచ్ఛన్న పుష్పంబుభాతిఁ । గరిముమానినవలువచేఁ గ్రాలెనాతి.

గీ. కారణం బేమొకోఁ చదుగాని కాంత । వన్నెవాసి దొలఁగి గన్పట్టుచుండెఁ
బ్రభలవెగ్గు మధ్యందినభానుబింబ । భానువులచేత వాడిన వల్లికరణి.

చిత్రాం—

ఉ. కూరిమిమీఱ నంకమునఁ గల్కుచు వింతలకౌఁగిలింతలన్
మారసుఖాబ్ధిఁ దేలకిట మానిని మీసిరిరెండుచేతులన్
జీరరనిండ జుట్టునె యినీ యిఁక గాపుర మెట్లునేతు నా
కీరముతోడుచత్తు శుచి కీలల ప్రాణమనంగఁ బుట్టెఁడే.

రాజ—అంతసాహసము వలదు. నే నిదే వచ్చితినిగదా! నీకేమికొదువ.

చ. తలిరులవిల్తుఁడగ్గె జెడుగుదయ్యము పట్టెను నన్ను గాననో
కలికిపదంబునందె యనుగంటలుచప్పుడు నేవిపాపురా
పలుకులమంత్రమున్నడివి పాయక పుప్పొడి మూదివెట్టియా
వల నధరామృతింబనెడు భవ్యపు దీర్థము నిచ్చిగావుమా.

ఇంకనువచ్చి నాయభీష్టంబును దీర్చకుంటివా నీకుఁగరుణ రాకుండిన నీవిరహ మోకరణి సైరింతు? నీకుఁ జేతులెత్తి జోతలిడినందులకు మదనరాజ్యం బేలునట్టుల దీవింపవా?

చిత్రాం—ఓరీ! ఱేఁడు లేనప్పుడు నన్నిట్టులేచుట పాడిగాదు. నానాథుఁడు నాచెంతనే యుండిన నన్నిటుల బాధింపజాలవుగదా!

రాజ—(తనలో) ఈబాధించుచున్న వాఁడెవఁడు? మదనుఁడా యేమి? వాఁడేగదా విరహిణుల మీఁదికి నొంటికాలుతోఁ జనుచుండును. (ప) మన మిరువరమేకమయిన నింక నామదనుని యాటలు కొనసాగవు కావున కవాటంబును దెఱువుము.

చిత్రాం—

చ. అకట కవాటముల్ దెఱచినట్టి నిశాంతములోనఁ గుక్క సా
చ్చు కరణి ఱేఁడు లేనపుడు చొచ్చితి వంతిపురంబు స్వచ్ఛచం
ద్రకులవరాబ్ధిలోఁ బొడమి తాతల తండ్రుల నాటిధర్మముల్
సకలము మంటఁబెట్టితివి చాలును గాలము నీకుచెల్లెరా!

రాజ—(తనలో) ఎవ్వరో చంద్రవంశజుఁడు తన్ను బాధింపుచున్నాఁడని చెప్పుచున్నది. ఇక్కడన్యులెవరు లేరు. కలవరింపు చున్నదేమో? (ప్ర) అన్నుల మిన్నా! కన్నులు విప్పిచూడుము.

చిత్రాం—ఓదైవమా!

. ఉ, సంగతు మెప్పుడేని విడఁజాలని నాథుఁడు లేనివేళ సా
రంగధరుండు నిర్దయత నాఱనిబాములఁ బెట్టుచుండఁ జి
త్రాంగిని నెంతదాన నకటా బ్రతికింపఁ దలంచినావొ యీ
యొంగిలిజీవితంబు వలదెట్టులొ యట్టులఁ జంపవేడెదన్.

రాజ—(తనలో) ఈబాములను బెట్టు సారంగధరుఁ డెవఁడు? నా కుమారుఁడు కాఁడుగదా వాఁడేయైన బాముల నేలబెట్టును? దుర్మార్గుఁ డాచంద్రుడు నా

వలయును (ప్ర) ఓసుందరీ! నీజీవితేశ్వరుండు వచ్చినాఁడు జీవంబుల విడుచునంత సిలుగు నీకేమివచ్చె? తలుపుఁ దీయుము.

చిత్రాం—ఔరా! సారంగధరా! ఎట్టిమాయలు పన్నుచున్నావు.

చ. పొలఁతుక నీదుభర్తనని బొంకులనాడెద వంతమాత్రనిన్
దలఁతునె భర్తగా నివిగదా యవలోడ వసంతమాను భం
గులు పతిచెంతలేమి నిఁకఁ గోరిక పండెనటంచుఁ దాటియా
తుల వడిఁ గట్టవచ్చితివొకో చెవు లీమెకుఁ దప్పఁగుట్టిరే.

శా. ఏమీ ప్రేలెదు నాల్కఁ జీలికలు గాదే పక్కునన్ వ్రక్కలై.
భూమిన్ దూలద నీదుమస్తకము జెప్పంజెట్టి కొట్టింతు నీ
నీ! మూర్ఖా యిఁక నోరుమూసి చను డాసెన్ జావు నీతోత్తురే
రీమూలన్ బడి యింత యంత తినిరో యేమన్న నీవోర్వఁగన్.

ఉ. పుట్టితి నేని సద్వ్యజన పూజ్యతఁ గాంచిన రాజుకడ్పునన్
బట్టితి నేని నీజనకు పాణితలంబును నేను సాధ్వినై
మెట్టితి నేని నీగృహము మేదిని ధర్మము గల్గె నేనియా
కట్టెఁడి వేగ బ్రద్దలగుఁ గావుత నీతల వేయి చెక్కలై.

తండ్రి చేపట్టినదానినిఁ బట్టవచ్చితివా? నీకు వావివరుసలు లేవా? ఛీ! మూఢుఁడా! నీవు పెట్టుచున్న చెట్టలకు నాయట్టిసాధ్వి యిప్పటికే మేనువిడవవలసినది కాని నా నాథుండు దగ్గరలేమి నొంటరిదానిని బలవంతముగా మరణించుట యుచితము కాదనియు నాథుఁడువచ్చినపిదప న్నమ్మహానీయ సుందర పాదారవింద సన్నిధానమున విడుచుటకై ప్రాణంబుల నెట్టులెట్లో నిల్పుకొంటిని.

రాజ—ఎవరో దేవిని బాధించుచుండిరని యెంచ నిప్పటికిఁ గదా! సారంగధరుండని ముంజేతి కంకణంబువలె స్పష్టమయినది. (కోపముతో)

గీ. క్రూర నీకామమును దీర్చుకొనుట కొఱకు । వెలఁది పినతల్లి వలయునే వృజనభీతి
వదలి ప్రసాదమును విడువంగఁ బాత । కుండు దేవాలయమ్మును గోరనట్లు.

నాదగ్గఱ నున్నప్పుడెన్నియో నీతులు చెప్పితివి తుదకు నీతులన్నియు నీరీతిగాఁ బరిణమించెనా? నీకుఁ జిత్రాంగి చెప్పినటుల కాలంబాసన్నమైనది కాఁబట్టియే నీ కీబుద్ధి పుట్టినది. "వినాశకాలే విపరీతబుద్ధి" యను శాస్త్రోక్తి తప్పునా? (కోపముతో) మూఢా! సారంగధరా!

చ. జననికిఁ బాణిపద్మము నిజంబుగఁ బట్టినదాని సాధ్వినిన్
జననిసమానఁగా హృదయసారసమందుఁ దలంపకిట్టి లీ
పనినొనరించితే పరమపాతక కన్నులఁ గానకార! యా
వనపు మదంబునం దిరుగువారలు వావినినైన నెంతురే.

చిత్రాం—(తనలో) ఇతని క్రోధానలంబును వచనేంధనంబులచే మఱింత ప్రజ్వరిల్ల జేసెద. (ప్ర) ఔరా! సారంగధరా! నీవు సారంగధరుండవు కానట్టు నా నాథుండవయి ఆగ్రహపడుచున్నటులను మీతండ్రిగారి స్వరమువంటి స్వరముతో బ్రకటింపఁ జేయుచున్నావా? ఎంతమాయలమారివి. ఇంతమాత్రమునకు నేను లోబడి తలుపులుతీసి నీవంచనకు లోబడుదునని యనుకొంటివా? సీ! పాప్మ హా! మనోహరా! ఏయవమానంబును నొందకుండ రక్షింపుము. నాపాలిఁటి మిత్తి వలె నీకీవేట యెక్కడ దాపరించినది.

రాజ—(తనలో) దేవి యింకను నన్ను సారంగధరునిఁగ నెంచి నాకయి పరితపించుచున్నది. ఏదయిన నొకయానవాలు స్మృతికిఁ దెచ్చెదను. (ప్ర) జీవితేశ్వరీ! మున్నొకనాఁడు వసంతకాలంబున నవ్యలతావితానముక్రింద నలరుల సెజ్జపయి మనము పవ్వళించియుండఁగా—

చ. అలుకలుగీరి లేదములపాకుల మడ్పులఁ జేతికిచ్చి య
వ్వలఁ జిఱునవ్వుతో జిలుగువల్వను నేసవరింపఁదలంచుమం
చెలమిసినొక్క ముద్దొసఁగి తెంతయుఁ దీపులకెల్లఁ దీపియై
వెలయుచు నాకదేవులు వేలును లత్తుకఁ గోట్లుఁ జేయఁగన్.

మ. చెలివంకం గనిపల్కవేళ వెనుకేఁ జేదోయిఁ గందోయిఁ గ
ప్పలలిన్ డాఁగుడు మూఁతలాడగను మావారెవ్వరో పేరునుం
బలుకుండన్నను బల్కకున్నఁ బలుకే బంగారమా యంచుఁ జ
క్కిలిగింత న్వొడిపించుకొంటి వతనిన్ గ్రేఁగంట వీక్షింపుమా.

చిత్రాం—(తలుపు తీసి) నాథా! నాకన్నులకగపడితిరి. ఇదియే నాజన్మమునకుఁ బదివేలు. పరపురుషావమానిత నగు నేనీ తుచ్ఛశరీరంబును విసర్జించి యశంబు గాంతును. ఇంతకు మున్నే చావఁదలఁచియు మిమ్మొకసారి కన్నులారఁ గాంచి చావనుంటి.

రాజ—

గీ. కళలనొప్పు కలికి నిన్నుఁ గాంచివాఁడు । చేటుపాటు నెఱుంగక చేరినాఁడె
గండుదీపకళికఁ జూచి పండటంచు । గరముపజ్జఁగదియు కీటకంబు కరణి.

చిత్రాం—

క. మానమె భోగము భాగ్యము । మానమె సకలంబునున్ మనుజాధీశా
మానము నశించినపిదపఁ । బ్రాణంబులిఁకేల దుఃఖపరములె గావే.

ఇంక నాకీ రొంగిలి బ్రతుకెందులకు? పతిచేతిలోఁ జచ్చిన సతికి సద్గతిగల దందురు. కావునఁ గరవాలంబునఁ గంఠంబును నఱికివేయుఁడు లేదా నాచేతికి ఖడ్గమిచ్చిన నేనిదే నఱుకుకొనియెద. నలువురి లోపలఁ దలయెత్తుకొని తిరుగఁజాల.

రాజ—నీకీతొందర యేటికి? అపరాధియగువాఁడు చావక నీవు చావనేల?

శా. ఏమేమీ పినతల్లియంచు మది నా నింతైన శంకింపలే
దామూర్ఖుం డవినీతుఁ డుత్కటుఁడు నా యాభీలఖడ్గాన నా
కామాంధున్ వడి ఖండఖండములుగా ఖండింతు హింసాహ్వయా
భూమీశున్ నిరయాబ్ధి ముంచిన నదే పూజ్యంపు స్వర్గంబగున్.

(తనలో) ఓ రాజరాజనరేంద్రా! త్వరపడకుము చిత్రాంగియందలి మోహంబుచే నామె చెప్పినమాట విని కులవర్ధనుండగు కుమారు నొక్కరునిఁ జంపుకొని తరువాత నీవేమిచేసెదవు? తప్పొప్పుల నారయ వలదా? (శిరఃకంపముచేసి) అరయుటెట్లు?

ఉ. సూనుని సద్గుణావళులఁ జూచిన నాతఁడు దుష్టకార్యముం
బూనెడటంచుఁ దోఁచుఁ జెలి బోరున బోరున దుఃఖమొందుటల్
గానఁగ నిట్లు చేసెనని గానఁగనౌ నెది నిశ్చయంబొ యే
దే తెలియంగలేమి మది యిట్టటు నయ్యోలభంగి లాగెడున్.

ఓ దయామయా! పరాత్పరా! ఈ జగంబులకెల్ల సాక్షిభూతుండ వీవేకదా. చిత్రాంగి తప్పిదమో సారంగధరుని తప్పిదమో నాకుఁ దెలియునట్లు ప్రసాదింపుము. (యోజించి) తెలియవలసిన దేమున్నది. హస్తామలకంబువలెఁ గన్పడుచున్నది. వాఁడీతప్పు చేయనిచో నీ కాంత వగపునకుఁ గారణంబేమి? రత్నాంగికన్న నెక్కుడు ప్రేమతోఁ జూచు నీపె సారంగధరునిమీఁద లేనిమాట పల్కునా? వెఱ్ఱిమమకారము వెఱ్ఱిగారాబము గలిగి వట్టిమాయికమే పుట్టిల్లుగాఁగల యీ కాంత పరిభవింపఁబడనిచో నిటుల వెతపొందదు. నన్ను సారంగధరునిఁగా నెంచి నప్పుడేమో చెప్పెనుగాని నిశ్చయంబుగాఁ గనిన వెనుక నీ కుమారుఁ డిటుల చేసెనని నోట నయిన నుడువదయ్యె. అటుల నుడువక పోవుటయే గాక మానహానిచేఁ బ్రాణహాని గోరుచుండె అవును. పతివ్రతలు తమ్ము నేరమున బాధించిన లోలోపల దుఃఖించుచుఁ దమ చావునకయి తెగింతురుగాని పెఱవారినిఁ బీడింపఁజూడరు. కావున సారంగధరుని తప్పుగాని చిత్రాంగి తప్పుగాదు. (యోజించి) ఆ సారంగధరుఁడయిన నిట్టి కట్టిడి కార్యంబునకు నొడిగట్టునా? పరకాంతలను సాక్షాన్మాతృభావంబున జూచుచుండును. పసివాఁడయిన నెప్పటనయిన నెక్కడను నొక్క చీఁకటి తప్పైన

రించినటుల వినికని యెఱుంగను. చీఁకటితప్పుమా టటుండనిమ్ము ఎవరిచేతనయిన వేళ్లు చూపించు కొననివాఁడు తలఁపరాని పినతల్లిని వేఁడునా. వట్టిమాట వట్టిమాట. చిత్రాంగి సవతితల్లిగదా సపత్నిమాత యెందయిన సపత్నియే కావున వానిపై నిట్టి నింద మోపె. కాంత యనియు సందేమియు నెఱుంగని గోలయనియుఁ దలంపుచుంటివి. కాంతయయిన నేమి పురుషునికన్న నెక్కుడు సాహసము కలిగియుండును గదా. ఏమెఱుంగ నటుల పయికి గమనించినంత మాత్రమున నెఱుంగనివా రౌదురా! పయికేమి యెఱుంగనివానివలె నీతులుచెప్పుచు దుర్గుణంబుల కాశ్రయులయిన వారెందరులేరు దుర్గుణంబులు గలవారు కొందఱు తమగుణంబులు వెల్లడి యగునేమో యని జంకుచేఁ దొలుదొలుత దంభవేషంబులు పూని యుండెదరు. లేకున్న మాయ వేషములతోఁ బనియేమి? కావునఁ జిత్రాంగి తప్పే నిజము. (యోజించి) కన్నులార చూడని విషయంబు నిదమిద్ధమని సిద్ధాంతీకరించు టెట్లు. అదియునుంగాక కోపమువచ్చినప్పు డేకార్యంబును జేయఁగూడదుకదా? శాంత బుద్ధితోఁ జక్కఁగా యోజించి దానిపయితోఁచు పర్యవసాన ప్రకారంబునఁ బ్రవర్తించుట శ్రేయము. (ప్ర) ఓకాంతామణీ! చింతనుడుగుము. వాని నిప్పుడ కారాగృహంబున నేనుంచి న్యాయసభయందు న్యాయాన్యాయంబుల విమర్శించెద.

చిత్రాం—జీవితేచ్ఛగలవారికి న్యాయాన్యాయంబులు గాని యవమానావలంబునఁ గాలుచున్న నాకునేల? శరీర విముక్తికన్నఁ బెఱదారి యక్కఱలేదు. మీరుండఁగానే వాఁ డిట్లుచేసెను; చెప్ప సిగ్గగుచున్నది. ఆనాఁడు ద్రౌపదియయిన సైంధవునిచే నింతహీనముగా బరిభవింపఁ బడలేదని తలంచెద. జీవితేశ్వరా! ఇంక నే నూరులకంటె నెట్లు పడుదును? ముత్తయిదువుచావు ననుగ్రహింపుఁడు. అవమానరోషంబులు నన్నావేశింప మిమ్ము నాదుర్మార్గునిగా నెంచి నోటికొలంది దూలనాడితి తన యవమానమున కెట్టులోనర్చినను ద్రికరణశుద్ధిగా మిమ్ము సాక్షాద్దైవంబుగా నెంచు నీచిత్రాంగి భర్తను దూరినందులకు బ్రతుకఁజాలదు. కావునఁ జంపి స్వర్గమునకుఁ బంపుఁడు.

రాజ—ఎట్టి ముద్దరాలవు! నన్ను సారంగధరునిగా నెంచి యిట్టులాడితివి. మతి యొందుకాదు కావు; నీకావంతయుఁ బాపంబులేదు. దేవీ! నీవీ పాపాత్ముని దర్శనంబుజేసి ఘటించిన దోషమ్మును దొలఁగించుకొనుటకు దేవదేవు నారాధింపఁ జనుము. నే నాదురాత్ముని శిక్షింప న్యాయస్థానంబునకుం బోయెద.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

గద్య—ఇది అష్టావధాని విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వర
ప్రణీత సారంగధర నాటకమునందలి
తృతీయాంకము.

---



# సారంగధరనాటకము.

## చతుర్థాంకము.

(కారాగృహము.)

సారం—

గీ. ఎట్టివానిగర్భంబునఁ బుట్టనేమి । యెట్టిసిరులను దులదూఁగనేమి నేఁటి
కిట్టి యపకీర్తిపాలయి యిడుములొంద । వలసె గాలముహాత్మ్యంబుఁ దెలియనగునె.

ఇట్లు ముందే తెలిసినఁ దగినంత జాగరూకతఁ గలిగియే యుందును.

సీ. చెలికాని నుడిబెడ కలరవ క్రీడ వేటికిఁ బోయినాఁడ నొక్కొ
పోయినఁబో కూకి పోయి నా పినతల్లి భవనఁబుపై నేల వ్రాలెనొక్కొ
వ్రాలెనుబో యాయఁ బ్రార్థింప నీయక కొమరుని నన్నేల కోరెనొక్కొ
కోరెనుబో చెల్మి కూడదంచును ఖల్క నదియేల తండ్రితో నుడివెనొక్కొ
గీ. నుడివెఁబో సత్యమెన్నక కడిమిఁదండ్రి । యిట్టిదండన మేల విధించెనొక్కొ
అక్కటా! ధాతయాఁ వ్రాతయలికమందు । మూఁడుబఁతులఁ వ్రాసెగాఁబోలునొక్కొ!

జరగినదానికి వగచినఁనేమికలదు? వగచిన నీముప్పు దప్పునా? ముప్పున కేమిగాని నిందకుఁ దలయెత్తఁజాలకున్నాఁడ. మాయమ్మను, సుబుద్ధిని నెట్లు చూడఁగలను? తొలిబామునం దెవ్వరి నిష్కారణముగా బాధించితినో యిప్పుడది ప్రాప్తమయ్యె.

సీ. పినతల్లి సుతుఁడంచు క్షమింపఁదాయెంగా దాయగానే నన్నుఁ దలఁచెఁగాని
కనిపెట్టలేదయ్యె జనకుండు న్యాయంబు నాయంబుజాక్షి వాక్యములనమ్మి
మంచిదెల్పెడు మంత్రి మన్నింపఁగంటిగా కంటిగాముందునఁ గలఫలంబు
దైవమైనను ముప్పుదప్పింపఁడాయెఁగా డాయఁగావచ్చి యన్యాయమంచు
గీ. నక్కటా! యెవ్వరిఁక దిక్కటంచుఁజేరు । వాఁడ నెయ్యదిమార్గ మెవ్వారికైనఁ
గఠినవిధి పరిపాకంబుఁ గాదటంచుఁ । దాటఁగోరంత శక్యంబు దలఁపలేరు.

సుబు—(ప్రవేశించి)

చ. హరహర యెంతమాట వినవయ్యెను చెప్పలికట్టిబాము చే
కురెఁ గలలోననైన ననుఁగూరిమి వీడనివానిబాసి యి

ద్ధర బ్రతుకంగఁజాల వడి దావధనంజయభీషణార్చులన్
శరనిధులందుఁ జొత్తు నిమిషంబునఁ బ్రాణము వోవునట్లుగన్.

నామిత్రుండు కడగండ్లఁ బడుచుండ నే బ్రతికియున్న నేమిలాభము? ఏ యుపాయముననైన శరీరవిముక్తుండనయ్యెద పోయెదను. (కొంతదూరము నడచి) అయ్యో! పోవుటెట్లు?

ప్రాణహితుని బాము శ్రుతులఁబడినయంత। మేదినీతలమెల్లఁ దమిస్రమయ్యె
నశ్రుధారలు దృష్టుల నడ్డుపరచె। నింక నేవిధిఁ జనువాఁడ నేదితెరువు.

సారంగధరుఁడు చిత్రాంగిని గోరుటచేతనా యతనికి బంధనాలయవాసంబు కలిగినది? ఏమిది ఎంతవింతగా నున్నది,

పరమాత్మఁగని చిక్కఁబట్టఁగోరెడువాఁడు పరకాంతకౌఁగిటఁ బట్టుటెట్లు
ఈశనామామృతం బెపుడుఁగ్రోలెడువాఁడు చెలిమోవి సుధ కాఁజెందుటెట్లు
సతతంబు సర్వేశు సంస్తుతించెడువాఁడు. తుచ్ఛవాక్యంబున తూలుటెట్లు
చీఁకటితప్పులఁజేయ నీయనువాఁడు తప్పిపలేక తనుదానె తలఁచుటెట్లు
హరుని మందిరంబులఁజూడ నరుగువాఁడు। పరులశయ్యాగృహంబున కరుగుటెట్లు
తలపహితుతప్పుగాదు చిత్రాంగితప్పె। యెంతకెంతైనదగరొకో యింతులన్న.

ఓచిత్రాంగీ! యెంతపనినొనరించితివి? నీవు మానిసివి కావు కలియుగరాక్షసివని తలంచెద రాజునకు గాజులుతొడిగించి బొమ్మవలె నాడించుచుంటివి. పూలహారము వలె నుండి కాలసర్పమైతివా? ఇంతకు నిన్ననవలసిన పనియేమి? నీమనోరథంబు దీర్పనికన్నఁజే నీ వెన్నికల్లలుచెప్పినను నంతమాత్రముననే నిన్ను మహాపతివ్రతా శిరోమణిగానెంచి రాజిట్లు చేయవచ్చునా?

చ. వలపునఁజేసి పార్థివుఁడు పాడితలంపక కాంత కల్లప
లుక్కుల నిజమంచునమ్మి తనకూరిమి కుఱ్ఱను నిట్లుచేసె ని
చ్చలు నిజదారహస్తముల జంత్రపు బొమ్మలభంగినాడు మ
ర్త్యులకును యుక్తమద్ది యిది యుక్తము కాదనుజ్ఞానముండునే.

కాముకులకు జ్ఞానములేకపోయినను సర్వేశ్వరుండయిన సత్యము వెల్లడింపఁ గూడదా?

చ. పటుమతి నాల్గుపాదములఁ బాయక ధర్మమునడ్పుచుండు న
క్కృతికముఁబూని యీశ్వర! యొకానొకదోషములేని వానిపై

కుటిలమనస్కురాలు వినఁగూడని నేరముఁబల్కు వేళ న
చ్చటఁ గలమాట చెప్పకిటు సత్యము భగ్గున మంటబెట్టితే.

వీరితోఁ బనియేమి? నా నెచ్చెలి యీ కురంగట నున్న బంధశాలయందున్నాఁ
డఁట సమీపించెదనుగాక! (సమీపించి) మిత్రమా!

గీ. రాహుచేఁగబళితుఁడైన రాజుకరణి। సైకతంబులోనున్న వజ్రంబుభంగి
వెన్నమనిలోని నిప్పట్లు నున్ననిన్ను। గాంచవలసె నాకన్నులు కాలిపోను.

నేఁడెట్టిదుర్దినము? దినమనననేల? నీనే పాతకుఁడను. కానిచో నేను వశీకృ
తేంద్రియు నిన్నిట్టుగాతునా? నీవు సుఖంబున్న సంతోషించు నేనుగష్టపడుచుండఁ
గాఁ గాంచఁగలనా? ఎంతపాప మెంతపాపము.

సారం—(సంశయించి తనలో) ఛీ! ఇంతదుర్మార్గున కింక సంశయమెందులకు? (ప్ర)
మిత్రమా! వగవకుము.

సుబు—వగవకుండు టెట్లు? శోకవహ్ని నిలువెల్ల దహింపుచున్నది.

సీ. అపరంజిన గలచేనంద మొప్పెడునీవు పిండశృంఖలముచే వెలసినావె
పువ్వులసెజ్జపైఁ బవ్వళించెడునీవు పాషాణవేదిపై వండినావె
కనుసన్న చేతనే జనులనడ్పెడునీవు దాసులకనుసన్నఁ దనరినావె
ధర్మహర్మ్యంబుల వాసంబుగనునీవు బంధశాలయందు బరగినావె

గీ. ప్రమనములు పరివేష్టింప వరలునీవు। విమనములుపరివేష్టింప వెలసినావె

సారం—

అక్కటా! యెట్టివారికినైనను గల। కాలమొకరీతిఁ గాలంబు గడుపనగునె.

(తనలో) ఆగతంబెఱింగి యితండు చెప్పినను విననైతి.

చ. నను విడనాడి పోయిన వనంబున ముప్పగునంచుఁ దల్లి చె
ప్పిననుడిదాఁటి దైవగతి బెబ్బులివాతను పిల్లలేడి చా
ద్పునహితుఁడెంత చెప్పినను బోయి విపత్తును జేతులార గొం
టిని విధివ్రాలు దాఁటుటకు నేననెంతటివాఁడ లెక్కయే.

సుబు—

చ. తగదని నేను జెప్పఁ బినతల్లి యటంచును విశ్వసించి దై
వగతిని నాపె కోపవన వహ్నికి నింధనమైతె నన్ను న
త్యగణిత దుఃఖసాగరమునందున ముంచిరె నేటితోడనె
న్వగలను గుందుతల్లి చెడబాసితె మాకు ఋణంబు దీఱితే.

సారం — మిత్రమా ! ఆయమ్మమీఁద నేల నేరం బాపాదించెదవు ? వినుము.

చ. తలఁపక దుష్కృతంబు పినతల్లినిఁ గోరె దురాత్ముఁ డంచు లో
కులు నను నిందసేయ విని కోపముఁ జెందకుమయ్య యొండచే
నలమటఁ జెందినీడ కొలఁ గాసెను దాళము క్రిందఁ జేరఁ ద
త్ఫలము శిరంబుపైఁ బడినభంగిని నయ్యెను జుమ్ము నెచ్చెలీ.

(తనలో) నన్ను దుర్మార్గుండని లోకము దూఱుచుండెను గాఁబోలు? ఎట్టి యపకీర్తికి లోనయితిని.

ఆ. అకట మంచివాఁడ నన్న మాటనె నేను । చెడ్డవాఁడనైతి చెడుగు నుడువు
నేఁడు మొదలు వెదలు నేనేమి సేయుదు । స్థిరనభాగ్య మెట్లు నెందు గీర్తి.

కావలసినదంతయు నయ్యె (ప్రి) నెచ్చెలీ ! ఎంత యెన్ని విధంబుల నాగ్రహించి నను నీవు మాగ్రము మాటవినలేదని కోపమును జెందకుమా.

సుబు —

చ. జననము నాఁటఁ గోలె విడఁజాలని నెయ్యము గల్గియుంట నీ
వనుభవమొందినట్టి గతి కారని శోకము సందులేక నె
మ్మనమున నిండియుంట నణుమాత్రము తావిఁక లేదు నాదు ప
ల్కులను విడనాడినందులకుఁ గోపము నిల్వఁగ మిత్రరత్నమా.

హా! హతదైవమా! సర్వసర్వంసహాధీశ్వర దివ్యమకుటచిరత్న రత్నప్రభావశోభిత పాదారవిందుండగు రాజరాజనరేంద్రునకుఁ గుమారుండై హృద్యానవద్య విద్యాధురంధరుండై శమదమాదిగుణమణిగణ ధరుండై నిజయశశ్చంద్రిక చేతదిగ్వధూటీస్మితకపోలంబులకు వన్నెను బెట్టు సారంగధరునకా యిట్టి చెట్టు?

సారం — మిత్రమా ! సుబుద్ధీ !

ఆ. గొప్పముప్పు వచ్చు గొప్పవారికిఁ గాని । యింతయంతివారి కెందు రాదు
పొడవు చెట్టుమీఁద బిడుగు పడును గాని । పొట్టిచెట్టుమీఁద నెట్లుపడును.

అంతియెగాక.

గీ. తాలమొక్కింతదప్ప భూకాంతులైన । వరలు సంపదలను కెట్లపాలు జేసి
గడవరాని విపత్తుల గడపి రజుని । వ్రాలు తలక్రిందుచేయు నెవ్వారికైన.

సుబు —

ఆ. సకలదానగతుల జనుల కాశ్రియమగు । పథుఁడ నీకు నెగ్గు సలిపె నకట
పండ్లు గలిగియున్న పాదపంబు గాంచి । తివ్వమంచు శిలల నువ్విసట్లు.

సారం—మిత్రమా సుబుద్ధి! ఊరడిల్లుము.

ఆ. సుఖమునొందువేళ సూనంబుచందాన । మనసుమృదులమగుచుఁ దనరవలయు
గష్టమొందువేళ గ్రావంబుచాడ్పున । మనసుకఠినమగుచుఁ దనరవలయు

సుబు—నీకష్టంబును గాంచిన పరమకిరాతునివంటి హృదయమునను నీరుగావలయును. ఇఁక నాయవస్థ నేమనిచెప్పవచ్చు? హా! దైవమా! ఘటనాఘటన చాతుర్యధౌరేయా!

గీ. అమృతమును గ్రోలువానికైనఁ గాల । మావఁగింజంత విపరీతమయ్యెనేని
గంజిసైతంబు మూఁడులోకంబులందుఁ । గఱవగుటన్న చందంబు గానుపించె.

చ. నిరుపమకీర్తిసంయుతుఁడు నిర్మలచిత్తుఁడు ధర్మకార్యత
త్పరుఁడు పవిత్రవర్తనుఁడు పాపవిదూరుఁడు సత్యశీలుఁడీ
ధరణిశవాత్మజుండు పినతల్లియొనర్చిన మాయచేత ని
క్కరణివిపత్తునొందె దయగావలె నిర్జరులార యొడ్డమై.

సారం—సుబుద్ధీ! మాపినతల్లి తప్పేమియున్నది. ఆమెను దూరకుము. నీహితుని పురాకృత దుష్కృతపరిణామ మనుకొనుము.

సుబు—అట్లనుకొని యూరడిల్లుట యెట్లు? హా పరమేశ్వరా!

సీ. ఏకాంతమందైన నితరభామలగాంచి జననిభంగినిఁజూచు చక్రవర్తి
కలనైన నవ్వులాటలకైన నెన్నఁడు బొంకునాడనియట్టి పుణ్యమూర్తి
తనవారు పెరవారలను భేదమావంత మనమందుఁదలఁపని మాన్యకీర్తి
తనకపకారంబు నొనరింపఁ దలపక శుభములనొసగూర్చు సుగుణవర్తి

గీ. కాఁడె సారంగధరుఁడట్టివాఁడకార । ణంబుగా బొందరాని కష్టంబునొంద
దైవమాయుపేక్షించుట తగదుతగదు । నీకు నామాట వినరాదొ లేక లేవొ.

సారం—సఖా! సుబుద్ధివయ్యు నీవుకూడ మూఢునిమాడ్కి వగవ నేమియనవలయు వినుము.

గీ. కాలవశముచేఁ బ్రాప్తమై కష్టశతము । జనునకునదయంత నదియె సమసిపోవు
సాంద్రమైన నీడలనీను జలదములు పంకజాతమిత్రునిఁ గప్పిపాయునటులు.

మిత్రుఁడా! జయసేన శూరసేనులు నాకు గనుపించలేదు. వారికిఁ బందెపుఁ బావురంబును ధనంబు నియ్యలేదు వారిజాడ యేమైననీకు దెలిసినదా?

సుబు—తెలియుటలేదు. అదియంతయును మాయగానున్నది నీకీముప్పు కలుగఁజేయఁగాఁ బోలు రాహుకేతువులవలె దాపరించినారు.

సేవ—(ప్రవేశించి) అయ్యా! న్యాయసభ తెరచియున్నారు. మీమీఁద నారోపించిన నేరంబును బరిష్కరింపనున్నారు.

సుబు—సేవకా! చిన్నమ్మగారు; కాదు మారమ్మగారు.

సారం—సుబుద్ధీ! ఇంక నీవు మాచిన్నమ్మగారి నేమైన నన్న నామీఁద నొట్టుసుమీ. రాజాజ్ఞయయినది. పోదము. (అందఱు పరిక్రమింతురు.)

(న్యాయవాదులతో రాజరాజనరేంద్రుఁడు ప్రవేశించును.)

రాజ—సారంగధరునిమీఁదఁ జిత్రాంగి తీసికొనివచ్చిన వివాదముతో నుభయపక్షంబులవారలును సముఖంబున నుండిరా?

సుద—అందఱు సముఖంబున నుండిరి. విచారణఁజేయుట కవిఘ్నమయిన యభ్యంతరము లేదు.

సుమం—అపరాధారోపిత యయిన చిత్రాంగిదేవిగారు సముఖంబున లేరు కావున వారినిఁగూడ పిలిపించవలయును.

రాజ—పిలిపించవలసిన యవసరములేదు. ఇంతకుమున్నే యీవిషయమై యామెను విచారించి యుంటిని. కొదువ సమాచారంబు సాక్షులవలన స్పష్టంబు కాఁగలదు.

సుద—మనోరమను బిలిపించవలయును. ఆమెయే మొదటిసాక్షి.

ధీమం—కింకరా! మనోరమను కేకవేయుము.

కింక—అయ్యా! చిత్తము, (ద్వారముకడకుఁబోయి) మనోరమా! మనోరమా! (అని కేకవేసి) అయ్యా! సిద్ధముగా నుండలేదు.

సుద—మరల నొక్కసారి పిలువుము.

కింక—(తనలో) అక్కడ లేక పోయిన నెవరిని బిలువవలయును. (బయిటకు వచ్చి) మనోరమా! మనోరమా!

మనో—(ప్రవేశించి) చిత్తము.

ధీమం—మనోరమా! ప్రమాణము చేయుము. దేవునియెదుటఁ బ్రమాణముచేసి నిజము చెప్పెదను. యథార్థముకానిదేదియుఁ జెప్పను.

మనో—(అటులఁ జెప్పును)

సుద—నీవు చిత్రాంగిదేవిని, సారంగధరకుమారుని నెఱుంగుదువా ?

మనో—అయ్యా ! ఎఱుగుదును.

సుద—సారంగధరుఁడు చిత్రాంగిదేవిగారి యంతఃపురంబునకు రాఁగా నీవు చూచితివా ?

మనో—చూచితిని

సుద—ఇప్పటి కెన్నిదినము లైనది? ఏవేళ?

మనో—మూఁడుదినములయినది. సాయంకాలంబున.

సుద—అప్పుడు నీవేమి కనిపెట్టితివి ?

మనో—నేను ద్వారముకడనుండఁగా యువరాజుగారు వచ్చి రాజుగారు మృగయార్థంబు వెళ్లినారాయనియు, దేవిగారిప్పుడు లోపల నేకతంబుగ నున్నారాయనియు నన్నడిగి నే నావల నన్ను శారికాకీరంబులకు మేఁతఁబెట్టుమని పంపించి లోనికి వెళ్ళినారు. లోపల నేమిజరిగినదో నాకుఁ దెలియదుగాని మరల నేవచ్చు నప్పుడు పయిపలువ లేకయే తత్తరముతోఁ బరువిడుచుండ నేనెదురయి యేమని యడుగ నావంకఁ గన్నుయినెత్తి చూడకయే వెళ్ళిరి. అప్పుడు నేనులోపలికిఁబోయి యమ్మగారినిఁ జూడఁగా బలవంతపెట్టఁబడినట్లు కనుపించిరి.

సుద—వీరపాలునిఁ బిలిపించవలయును.

ధీమం—కింకరా ! వీరపాలుని బిలువుము.

వీర—(ప్రవేశించి) చిత్తము.

ధీమం—వీరపాలుఁడా ! ప్రమాణముచేయుము. (వెనుకటివలెనే ప్రమాణవచనము.)

సుద—చిత్రాంగిదేవిగారిని, సారంగధరకుమారుని నీవెఱుంగుదువా ?

వీర—ఎఱుఁగుదును.

సుద—సారంగధరకుమారుండు చిత్రాంగిదేవిని బలవంతము చేసినవిషయం బెఱుంగుదువా ?

వీర—ఎఱుఁగను.

సుద—దీనినిగూర్చి నీకుఁ దెలిసినదంతయు సభాస్థలియందు వెల్లడింపుము,

వీర—నేను ద్వారముకడనుండఁగా నేఁటికి మూఁడుదినంబులక్రిందట సాయంకాలంబున యువరాజుగా రమ్మగారి యంతఃపురంబునకువచ్చి తిరిగి రెండుగడియల కాలంబునఁ దొట్రుపాటుతోఁ బరువిడి పోవుచుండఁగా నేను జూచితిని. ఇంతకుమించి నాకేమియుఁ దెలియదు.

సుద — సుబుద్ధిని బిలిపించవలయును.

ధీమం — కింకరా! సుబుద్ధినిఁ బిలువుము.

కింక — అయ్యా! చిత్తము. సుబుద్ధిగారు! సుబుద్ధిగారు!

సుబు — (ప్రవేశించును.)

ధీమం — (ప్రమాణవచనమును జెప్పింపవలయును.)

సుద — మీరు చిత్రాంగిదేవిగారిని, సారంగధరుని నెఱుఁగుదురా?

సుబు — అయ్యా! ఎఱుఁగుదును.

సుద — సారంగధరునకు మీకు నన్యోన్యమైత్రి కలదనుట నిజమేనా?

సుబు — నిజమే.

సుద — సారంగధరుఁడు తృతీయా శుక్రవారమునాఁడు చిత్రాంగిదేవిగారి యవరోధంబునకు వెళ్ళియుండెనా?

సుబు — వెళ్ళెదనని నాతోఁ జెప్పెను.

సుద — ఎంతసమయంబున?

సుబు — ఒక యామమాత్రము ప్రొద్దుండెడు వేళ.

సుద — సారంగధరుఁ డొక్కఁడేనా? వెంట నెవరయిన నుండిరా?

సుబు — సారంగధరుఁ డొక్కఁడే.

సుద — సారంగధరుఁ డెన్నఁడయిన నిదివఱకు మీహితమును మీఱెనా?

సుబు — మీఱలేదు.

సుద — (కూర్చుండును.)

సుమం — (లేచి) ఈసాక్షుల ముప్పురను మఱికొన్ని ప్రశ్నంబు లడుగుటకు నాజ్ఞ వేఁడెద.

రాజ — మంచిది తెలిసికొనుము.

సుమం — మనోరమా! పరపురుషుఁడైన సారంగధరుఁ డంతఃపురంబులోనికిఁ బోవుచుండ నీవేల యభ్యంతర పెట్టవైతివి?

మనో — అయ్యా! తల్లియొద్దకుఁబోవు కుమారు నడ్డగించుట యనావశ్యకఁబని యెంచితిని. కావున నడ్డుచెప్పనైతిని.

సుమం — సారంగధరుఁడు పరువిడి వెళ్ళినపిమ్మట చిత్రాంగిదేవి బలవంతపెట్టఁబడినట్లున్నదని చెప్పియుంటివే దేనినిబట్టి యూహించితివి?

మనో—అయ్యా! దేవేరి మలినవస్త్రధారిణియై యుండుటనుబట్టియు, యువరాజుగారు తత్తరముతోఁ బరువిడిపోవుటనుబట్టియు, నట్లూహించితిని.

సుమం—దేవిగారీగతి నుండుట సారంగధరుని బలాత్కారమువలననే యని నిశ్చయింపఁగలవా?

మనో—నిశ్చయింపఁజాలను.

సుమం—మనోరమా! నీవు ప్రక్కకుఁ బొమ్ము. సుబుద్ధీ! సారంగధరుఁడు చిత్రాంగి దేవిగారి యవరోధంబున కేమిపనిమీఁద నేగెను?

సుబు—ఆ మేఁడపైవ్రాలిన పావురంబును గొనితెచ్చుటకు.

సుమం—ఆపావురం బెవరిది? అతఁడొంటరిగా నక్కడకుఁబోవ గతంబేమి?

సుబు—అది మాళవరాజ నందనుండగు జయసేనునిది. వీరు పందెమిడుకాలంబున నిరువురి పావురంబులలో నెవరిదైన నీరాజ్యంబునవ్రాలిన సారంగధరుండును మాళవదేశంబున వ్రాలిన జయసేనుండును స్వయముగాఁ దెచ్చియిచ్చుకొనునట్లు సమయం బేర్పరచుకొనుటచే సత్యహానికోర్వఁజాలక నేనువలదన్నను వినక యొంటరియై చనెను.

సుమం—(కూర్చుండును)

రాజ—సారంగధరా! నీవు చిత్రాంగిమేడకు వెళ్ళియుంటివా?

సారం—వెళ్ళితిని.

రాజ—ఈవస్త్ర మెవరిది?

సారం—నాదియే.

రాజ—అంతఃపురంబున నేమిజరిగినది?

సారం—(నిరుత్తరుండగును.)

రాజ—నిరుత్తరం బంగీకార సూచకంబా?

సారం—(తెచ్చపడును.)

సుమ—చిత్రాంగిదేవేరిని సారంగధరుఁడు బలాత్కారంబు జేసినట్లు దేవేరిపక్షంబున విచారింపఁబడిన సాక్షులు మువ్వురివలన స్పష్టీకరింపఁబడియున్నది. ఎందుచేతనన సారంగధరుఁడు మందిరమందు ప్రవేశించునపుడు తన యుద్యమానుకూలముగా నుండునటుల రాజుగారు మృగయార్థంబు వెళ్ళినారా యనియు దేవిగారు లోపల నేకతంబుగా నున్నారా యనియు నీరెండుప్రశ్నంబులను దాసియైన మనోరమను నడిగియుండుటను బట్టియు ననావశ్యకంబుగా నాపెను శారికాకీరములకు మేఁతఁబెట్టుమను మిషచేత స్థలాంతరమునకుఁ బంపియుండుటంబట్టియు

నీతం దవరోధంబును దురుద్దేశముతోఁ బ్రవేశించినట్లు స్పష్టపడుచున్నది. మందిరాభ్యంతరమునకుఁబోయి యచ్చట దేవేరిని సారంగధరుండు బలాత్కరింపని యెడల లోన రెండు గడియలకాల ముండుటకు గాని పిమ్మటఁ దత్తరపాటుతోఁ బరుగిడుటకుఁ గాని వచ్చునప్పుడు పైవలువ నచ్చట వీడుటకుఁ గాని మనోరమ చూచునపుడు దేవి మలినవస్త్రధారిణియై విచారముతో నుండుటకుఁగాని తగినకారణము లుండవు. కావున సారంగధరుఁడే దోష మొనరించినట్లు నిశ్చయమగుచున్నది. సారంగధరునకు సుబుద్ధికి నన్యోన్యమైత్రి కలదనియు సుబుద్ధిమాట నెన్నఁడును మీఱలేదనియు ఋజువు కాఁబడినది. అట్టి సారంగధరునకుఁ జిత్రాంగిపైన మోహసంబంధమైన దురూహ చిరకాలమునుండి యతని మనంబునఁ బాతుకొనియుండుటను బట్టియే పరులకెవ్వరికిఁ దెలుపఁగూడవని యీ దురూహ తన నెచ్చెలియైన సుబుద్ధికైనను జెప్పక దాచియుంచి యీతరుణము నాలోచించి ప్రాణసమానుఁడైన మిత్రుండగు సుబుద్ధి వలదన్నను వినక మందిరంబునకుఁ జనియెను. అదియునుంగాక రాజకుమారులు వినోదార్థ మేర్పరుచుకొన్న యీ పందెములోని పావురంబును స్వయముగాఁ దెచ్చియిచ్చునట్లేర్పరుచుకొనుట యెన హాస్యమైనను నిమిషచేత నెప్పుడును దోడు నీడవలెఁ దన్ను వెన్నంటియుండు సుబుద్ధిని వీడి యేకతంబునం దన యభీష్టకార్యమున కేగుట కవకాశము కలుగఁజేసికొనియెను. అందుచేత సారంగధరునకుఁ జిత్రాంగిదేవిగారియందు మోహముండుట నిశ్చయంబనియు సాహసమునందు దేవిని భంగపఱుప యత్నించెననియును నమ్మఁదగి యున్నది. కాబట్టి యీతప్పిద మొనర్చినందులకు సారంగధరునకుఁ దగుశిక్షను విధించుటకయి దేవరను బ్రార్థించుచున్నాఁడను.

సుమం—(లేచి) చిత్రాంగి దేవిగారిని సారంగధరుఁడు బలాత్కరించినట్లు తేఁబడిన వివాదమునందలి సాక్ష్యమునుబట్టిచూడ సారంగధరుఁ డపరాధియనుట కెంతమాత్ర మవకాశము కనుపించలేదు. ఏలయన నంతఃపురస్త్రీలయం దన్యుల కానకలిగ ననుట కల్ల. అందును దల్లియందుఁ గుమారునకు వలపుజనించెననుట మిక్కిలి విరుద్ధము. దేవేరిపక్షంబున విచారింపఁబడిన 1-2 సాక్షులు నిరంతర మీయమ్మగారి మందిరంబునఁ గాచియుండి యామెచేఁ బోషింపఁబడు దాసదాసీజనంబులై యున్నారు. అదియునుగాక సారంగధరుఁడు నేర మొనరించుచుండఁగాఁ జూచితిమని చెప్పెడు ప్రత్యక్ష సాక్ష్యముగాని చేసియుండెనని సహేతుకముగా ననుమానించితిమని చెప్పెడు సాక్ష్యముగాని యెంతమాత్రము లేదు. మొదటిసాక్షియైన

మనోరమ చిత్రాంగిదేవి గారి యాజ్ఞప్రకారము సేవించుటకొఱ కేర్పడినది కాని యొరుల యాజ్ఞ నెరవేర్చుటకుఁ గాదు. అట్టిమనోరమ సారంగధరునిచే నాజ్ఞాపింపఁబడిన కల్పితకార్య మొనరించుట కేగెననుట నమ్మఁదగినది గాదు. ఇదియును గాక మందిరము వెలుపను నప్పుడు సారంగధరుడేఁ బలాత్కరింపఁబడిన నవంగీకారమ్మునఁ దత్తరపాటులోఁ బరువిడి యుండవచ్చును. కావున నేర మితఁడే చేసినాఁడని చెప్పుట కిదియొక కారణము కాదు. సారంగధరుఁడు మందిరమందు దురూహతోఁ ప్రవేశించినయెడల నచ్చట జాగరూకతతోడనే మెలంగుచుండును. అట్టివాఁడు తన కపాయకరమగు సాక్ష్యము నీయఁదగిన తనపైవలువను మందిరమందు విడిచివచ్చుట పొసఁగదు. సారంగధరుఁడు బలాత్కరింపఁ బడుటలోఁ దనవసనం బపహరింపఁబడినందుననే దానినటవిడిచి పరువిడియుండవచ్చును. కాని లేనిచో నట్లు పరువిడుటకుఁ గాని వస్త్రంబువిడుటకు గాని తగు కారణంబు కాన్పింపదు. కావున సారంగధరుఁడు దోషియనుట కిదియొక కారణము కాదు. ఎవరి రాజ్యమునఁ బావురంబు వ్రాలినవారు స్వయముగాఁ దెచ్చి యియ్యవలెననుమాట జయసేనునిచే నుడువఁబడినది. కాని సారంగధరునివలన కాదు. రాజధర్మమునుబట్టి యితఁడందుల కంగీకరించుట యుచితమే. జయసేనునిచేఁ జంపబడిన పావురము చిత్రాంగిదేవి గారి మేడపై వ్రాలుననియుఁ దానచ్చట కేకతంబునఁ బోవవచ్చుననియు ముందుగనే యూహించి పైబందెమున కంగీకరించెనని చెప్పుట శశవిషాణమ్ముగా నున్నది. అందుచే సారంగధరునకు మనంబున దురూహ పొడమియుండెననుట కివి కారణములు కావు. సారంగధరుండు సర్వశీలుండును సుగుణాకరుండును జితేంద్రియుండు నగుటచేఁ దనకుఁ దెలిసినవఱకు యథార్థమని యొప్పుకొనియె. ఇతని గుణంబులఁగూర్చి దేవరకెఱుంగరాని దెద్దియుఁ గానరాదు. సారంగధరుఁడు నిర్దోషి కావున నతనిపై నక్రమముగాఁ దేఁబడిన యానేరము తొలగించుటకుఁ బ్రార్థించెద.

రాజ.—ఒకానొకసమయంబునఁ గళంకమనస్కులు ధర్మజ్ఞులుగను మంచివారు కళంకమనస్కులుగను గాన్పించుచుందురు. మోహవిష మెట్టిజ్ఞానము కలవారినైన నవినీతులఁజేయును. అట్టిమోహముగల పురుషులకు ధర్మాధర్మ విచక్షణయందు మనసు చొరదు. అందుకు నట్టిమోహంబుచేఁ బీడింపఁబడుచున్నను బురుషప్రయత్నములేనిచో స్త్రీలు తమంతతాము పైకొనిరనుట విననివిషయము కావున సారంగధరుఁడే తప్పుచేసియుండునని నమ్మితిని. ఇందులకు మీ యభిప్రాయమేమి? (ఉపప్రాడ్వివాకుల నడుగవలెను.)

ఉపప్రాడ్వి—సారంగధరుఁడు గుణవంతుఁడైనను విచారణాంశంబులంబట్టి దోషిగాఁ గన్పించుచున్నాడు.

రాజ—అంతఃపురద్రోహికిఁ బదకరంబులు ఖండించుటయే శిక్ష కావున నట్లుచేయుటకుఁ దీర్మానింపఁబడినది.

సారం—

వ. కనఁబడు ప్రాణిసంఘము లోకానోక వేళకునైన నష్టమై
చనుట నిజంబుగాన మదిఁజావున కేమియు ఖేద్వఁగాని పా
వనతరవంశమున దెలుపఁ బాతకినేల జనించినాఁడనో
యని పదియంత లెక్కుడుగ నశ్రుకణంబుల నింతు భూవరా.

(అందఱు నిష్క్రమింతురు.)

గద్య—ఇది అష్టావధాని విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వర
ప్రణీత సారంగధర నాటకమునందలి
చతుర్థాంకము.



# సారంగధరనాటకము.

## పంచమాంకము.

రాజభవనము.

(రాజరాజనరేంద్రుడు చిత్రాంగితో ప్రవేశించును.)

రాజ—

చ. గొనముల ప్రోవుముద్దులనుగూర్చెడు కుఱ్ఱవివేకశాలి కాం
చనసమవర్ణవిగ్రహుఁడు సర్వసులక్షణసంయుతుండు పా
వనచరితుండు పుణ్యములపంటని నమ్మినపుత్రుదప్పు జే
సెననుచు జంప బంపవలసెన్ కఠినంబులు రాజధర్మముల్.

చంప కుపేక్షించిన రాజు తన కుమారుఁ డగుటచేఁ దప్పుఁ జేసినను శిక్షింప కూరకుండెఁ. మఱియొకరినయిన శిక్షింపఁడా? ఇంతకు మోహపాశ బద్ధులకు ధర్మంబు గడుదూరంబని పలుదెఱంగుల నిందింతురుగదా యని యట్టికఠినకృత్యంబున కొడిగట్టితిని. హా తండ్రీ! సారంగధరా!

చ. ఇలఁగల సద్గుణావళుల నెంతయు నారసి ప్రోవుజేసి పెం
పలరెడు ముద్దుటందముల నన్నియు నొక్కెడ ముద్దఁజేసి నిన్
బలువురిలోనఁ జేరుగను వాంఛను గల్పనజేసి ఫాలపుం
దలమున నిట్లు వ్రాయుటకు ధాతకు నెట్టులఁ జేతులాడెనో.

చేతులాడ కేమి? కన్నకొడుకును గానలో ఖండింపుఁడంచుఁ జెప్పుటకు నాకు నోరాడలేదా?

మ. అకటా! యొక్కఁడవైననీవు మనియున్నట్టేని నానాఁటఁ జం
ద్రకులం బెంతయుఁ దమ్మితంపరగుచున్ ధాత్రీతలంబంత న
త్యకలంకస్థితిఁ బొల్పునంచు మదిలో నాసింపఁ గొంతెమ్మకో
రికలయ్యెంగద నాదుకోరికలు తండ్రీ! నాయభాగ్యంబునన్.

చిత్రాం — నాథా! ఊరడిల్లుఁడు.

(తెరలో) హా నాథా! హా పుత్రా!

రాజ — హా నాథా యని నాముద్దుఁబోడలు కనకాంగియు హా పుత్రా యని రత్నాంగియు వచ్చుచున్నారు. వీరి మోముల నే నెట్టులఁ జూడఁగలను. చూడకేమి.

మ. ఇట నామాతఁగనుండి వార్ధకమునం దీ రాజ్యము న్వాని పి
మ్మటఁ బావంగఁ దిలోదకంబులిడు తన్మద్గోత్రము న్వెంపు సే
యుటకే నెవ్వనిపైన నాసనిడినానో వానినే చంపఁబం
పుటకుం జేతులమీఁదఁ బాపువిధినం బుట్టించి యుండెంగదా.

రత్నా — (ప్రవేశించి తనలో) అయ్యో దైవమా! కానకయొక్క కుమారునిఁ గాంచి వాని చేతులమీఁద మన్నయ్యెద నింక నాకేమి యనుకొనఁగా నిట్లొనరించితివా! సారంగధరుఁడు కాఁడా యని యనిపించుకొన్న వాఁడిప్పుడిట్టి తప్పొనరించునా? ఏమి కాలవైపరీత్యము.

సీ. అంతఃపురంబున కరుగ భీతిలువాఁడు సజ్జగీమునకెట్లు చేరినాఁడో
తలయెత్తి మాటాడఁ ద్రపను జెందెడువాఁడు ప్రల్లదంబుల నెట్లు పల్కినాఁడో
కుసుమకోరకములఁ గోటగిల్లనివాఁడు కోమలియొడలెట్లు గుచ్చినాఁడో
పరకాంతలను దల్లి పగిదిఁ జూచెడువాఁడు పినతల్లి నేయాట్ల వేఁడినాఁడో

గీ. కరుణ నెల్లవారికి నీతిఁ గఱపువాఁడు। తగుదునని కామునియొట్లు తలఁచినాఁడో
అక్కటా నమ్మఁజాలఁ జిత్రాంగి మాయ। చేత నీపాటొదవె వేయి చెప్పనేల.

ఓసీ! చిత్రాంగి! యింతపని జేసి కడిగిన ముత్యమువలెఁ గూర్చుంటివి? కాల చక్రము తిరిగినది. కావున నెప్పుడో చచ్చినట్లుంటయే సర్వవిధంబుల శ్రేయము.

(పరి) నాథా! పుత్త్రభిక్ష పెట్టుము.

ఉ. కానక కానకెట్టులెటొ గాదిలికూనను బొందగాని నీ
సూనుని శొక్కనింగని వసుంధరలోఁ దలయెత్తినాము నీ
వేమను నిన్న మొన్న ధరణీశ్వర వీనినిఁ జంపఁ బంపెదే
కానకు భగ్గుభగ్గుమని కాలెడునగ్గినిఁ బువ్వువైతురే.

ఏకపుత్రవిషయంబు కార్యము గతించిన పిదప నెంతచింతించిన నావంతయు లాభములేదు. కావున దూరమాలోచింపుఁడు.

రాజ — పుత్త్రదుఃఖముచే నిట్లుపలుకుచుంటివి. కాని, ముందు వెనకు వచ్చునింద కుబుం

గళహోయితివిగదా? అంతఃపురద్రోహిని గాలుసేతులు ఖండింపుఁడంచు బెద్దలు విధించిరి. కావున నీశిక్ష తప్పదు. ఓరత్నాంగి!

చ. ఎవనిశుభంబుగాంచి జగమేలినయట్టుల సంతసింతువో
యెవనిని నల్వురౌనఁగ దృష్టిభయంబున రక్షఁగట్టెదో
యెవనిని జీవజీవమనియే తలపోయుదొ వాని నీ సుతుం
భువినిఁక లేనివానిఁగనొ పుట్టనివానిగనో తలంపుమా!

రత్నా—అట్లు తలంచి యూరడిల్లుట యెట్లు పోనిమ్మ.

చ. తనయునిఁగోడలిన్ నన్నును దగ వనంబున కంపుప్రాణమం
డిన బలుసాకునైనఁదిని నిల్తుము నాలుగునాళ్ళు ఘోరశి
క్షను విధింపకయ్య యిటు గాటికిఁ గాళ్ళనుఁ జాచినట్టి మ
ర్త్యునకును బ్రాణమన్న మదిఁగోయఁగ నోపని తీపియేగదా.

రాజ—మానినీమణీ! ఏల యిట్లుపలికెదవు. నాకుమాత్రము దుఃఖంబు లేదనుకొంటివా? ఆఁడుది యెలుగెత్తియేడ్చును. మగవాఁడు లోలోపల గృశించును. నేనిటనుండుట తగదు. (నిష్క్రమించును.)

రత్నా—చెల్లెలా! చిత్రాంగీ! పెక్కుకాలంబు బిడ్డలులేక తుట్టతుదకు నాపరమేశ్వరానుగ్రహంబున నీయొక్కకుమారునిఁ గంటిని. నాకుఁ బుత్రుండై నీకు బుత్త్రుఁడు కాఁడా? ఎట్లైన మరణంబులేకుండునట్లు రాజుగారితోఁజెప్పి బిడ్డ బిడ్డాయటంచు నాపోవు నీదీనురాలికిఁ బుత్రభిక్షము పెట్టుము.

కన—(ప్రవేశించి) అమ్మా! యీకోడలినిఁ గరుణాదృష్టిం బరికించి పతిభిక్ష పెట్టుము.

చిత్రా—ఓసీరత్నాంగీ! రాజూరలేఁడుగదాయని కుమారునిఁబంపి యింతయాగడంబు చేయించి తుద కీమొగమును బెట్టుకొని తగుదునని సిగ్గులేక చెల్లెలా యని నోరంత తెరచి పిల్వవచ్చితివి? నీకు మొగమెట్లు చెల్లెనే? కడుపులో లేని ప్రేమ కౌఁగలించుకొనిన వచ్చునా? మాటలందు గన్నమ్మ, పెట్టునందు సవతితల్లియనుట యిట్టివే కాఁబోలు? ఇట్టిది నీకుఁ దగునుగాని మరియొకరికిఁ దగదు. (నవ్వి) చాలుచాలు నేనా పుత్రభిక్ష పెట్టుదానను. గొడ్డురాలనని జాలితలంచి నీకుమారుఁడే నాకుఁ బుత్రభిక్ష పెట్టవచ్చువాఁడు.

కన—శివశివా! యెంతమాటనంటివి. ఈయమ్మ తనకుమారుని దుష్కార్యమునకుఁ బంపునంత యవివేకురాలా? ఈమె మాట నటుంచుము, ఆయనయేమైన నిట్టిదుర్వృత్తికి

జొరబడునా? పరదారయన్న గన్నెత్తనివాఁడు పినతల్లిని నిన్నుఁగోరునా? ఎక్కడమాటలివి?

చిత్రాంగి—(తనలో) వీరనినట్లు సారంగధరుఁడు తప్పు చేయలేదు. (యోజించి) చేయకేమి నేనంతగా బతిమాలఁ జెడచెవిని బెట్టలేదా? ఇంతకన్న వేఱుతప్పు కావలయునా? (ప్ర) ఓసీ కనకాంగీ!

ఉ. లోకవినిందితంబయిన లోపము జేసినవాని హీను సు
శ్లోకుఁడటంచువందిగతి స్తోత్రముజేసెదవేల మంటినే
కాకలఁగన్న పైడియుని కల్లలఁబల్కెద వత్తకన్ననే
డాకులనెక్కుడే చదివినట్టి వెలందివె యెంతదానవే.

రత్నా—(తనలో) ఈమె యిట్లనుచున్నది. నాకొడు కేమైనఁ దప్పానరించెనా యేమి? (యోజించి) కాదు కాదు. వానిగుణము నాకు తెలియనిదా? ఈమె యెంతకైన-దగును? (ప్ర) చెల్లెలా! నాకన్న నిన్నెప్పుడు గౌరవంబుగాఁ జూచు నీతనయుని యందు నీవే దయవిడనాడినచో లాతివారు దిక్కగుదురా? పాపంబన్న భయంపడును. ఏమియు నెఱుంగఁడు. ఆకలియెఱింగి, అన్నము బెట్టిన దినును. లేకున్న నూఱకుండును. అట్టివానిపై నీకలుకరేల?

చిత్రాం—

ఉ. చాలనుజాలఁ జక్కటులు చక్కఁగదిద్దకు నోటిలోపల
న్వేలును బెట్టినం గరువనేరఁడు చేతుల వెన్నబెట్టినన్
బోలఁగ మ్రింగనేరఁడు సుపుత్రుఁడు కన్నులనైన విప్పఁగాఁ
జాలని పొట్టిపాపఁడు నిజంబుగనీవును నంగనాచివే.

కన—అమ్మా! జీవితేశ్వరుని బాసి యింక బ్రతుకఁగలనా?

సీ. సహధర్మిణీచిత్త శతపత్త్రమునకన్న బ్రాణనాధుండు ప్రభాకరుండు
దారభునన్మయువారిదంబున కెంచ నాత్మనాధుండు జంఝానిలుండు
భవసముద్రతరణపాటవగార్హస్థ్యనౌకకుఁ దయితుండు నావికుండు
జాయావినుతచారు సౌందర్యవనమున ధ్రువముగ నిజమనోధవుఁడు మధుఁడు.

గీ. నిఖిలజనసుతవృషభూరినిధులఁజూప । నాత్మవల్లభుండల భానురాంజనంబు
అట్టి జీవితేశ్వరునిబాసి యెట్టులోర్తుఁ । బ్రాపులేక నేలఁబడినవల్లిభంగి.

కావున నెటులయిననఁగరుణించి పతిభిక్షఁ బెట్టుము.

చిత్రాం — చాలుఁజాలు, ఈగోడవనాకేటికి దాపరించె. నాపరాభవంబునకే లోలోపలఁ గుందుచుంటిని. ఇంతయవమానంబు మీకుఁ దటస్థమయిన మీరీ నీతులు కంచు గీచినట్లుల్లు చేయిగొంతులు పెట్టుకొని యుపన్యసింతురా ? ఓసీ ! కనకాంగీ !

ఉ. ఇంచుక సిగ్గులేకఁ దలయెత్తుచు నీవునుగూడ నొక్క స్త్రీ
వంచను విఱ్ఱవీగి వెలయాలివిధంబునఁ గాలుసేతులా
డించుచు నీతులంబలికె దింకను గ్రంథము కట్టుమూరు మా
యించెద నొక్కమూలఁబడి యెప్పుడొచ్చిన యట్టులేడ్వుమీ.

రత్నాం — సుగుణరత్నాకరుఁడగు సారంగధరుండిట్టి తప్పుసేయనేఁజేయఁడు. ఒకవేళ జేసిన వేదిరో యొకవిధముగా శిక్షింపఁజేసి పినతల్లివి నీవే మన్నింపకుండిన నింక గత్యంతర మేది ? గడ్డము పుచ్చుకొని బ్రతిమాలెదను. (సమీపించును)

చిత్రాం — నాసమీపంబునకు రాకుము. దూరముగాఁబొమ్ము.

ఉ. వంచన బుద్ధివోవిడక ఛీనకుదాశకు దాచినట్లుగా
వించినతప్పుప్రార్థనల పేరిమిలోపలఁ గప్పిపుచ్చుచున్
మంచితనంబుజూపుదువు మన్నఁగ నీకును గాదు నిన్ను ని
ర్మించిన బ్రహ్మకైనఁ దరమే విరమింపక వాఁగకేటికిన్.

కన — అమ్మా ! పుత్రదుఃఖముచే నీమెయుఁ బతివియోగదుఃఖముచే నేనుఁ నిటులఁ బరితపించుచు నదేపనిగా బతిమాలుచుండ జాలిగొనవేమి ? ఎన్నితప్పులున్న మన్నింపుము. ఈదుఃఖసాగరంబునుండి దయాయానపాత్రంబుచే నొడ్డుజేర్పుము.

చిత్రాం — నీవుమాత్ర మెక్కడనుండి వచ్చినావు ? ఆయత్తకుఁ గోడలవు కావా ? మిమ్మొ నిద్దఱిని నా బ్రహ్మ యేకలగ్నమందే సృజించినాఁడు.

చ. బుడిబుడి యేడ్పులేడ్తువెత బొందినయట్టులఁ బైకినిట్టిగా
రడము నెపందు నేర్పవడిఁ ద్రవ్వెదు ఘాతలు నిల్చుతావులన్
గుడగుడదారాజపల్ సలిపి కూర్చునియుండినచోట్ల గుంటలు
న్బడునుగయాలి కోడలవు నైజము టక్కులు నీకున తకున్

రత్నాం — చెల్లెలా పాలముంచినను నీటముంచిన నీదేభారంబు. మాబ్రతుకు నీపాలఁ బడినది. కృతంబుగానుము. నీపాదంబులను బట్టుకొందును. (అట్లు చేయఁబోవును.)

చిత్రాం — నాపాదంబులను బట్టుకొనుట యెందులకు ? పొమ్ము.

చ. అవునవు నందినన్ సిగయు నందకయుండినఁ గాళ్ళుపట్టికొం
దువు పయి కేమెఱుంగ వెటుదోఁచిన లోఁ బదియంతలుండవే

దినమున గాకికూఁత విని దీనతనొందిన రాత్రి నర్మదన్
దవులక దాటునట్టి యలుకు దబ్బరయాయె గయాలితొయ్యలీ.

రత్నాం—(తనలో) కాలచక్రంబు తలక్రిందగుటచే వంగ నెత్తిమీఁద మఱింత కాళ్ళు పెట్టుచున్నది. ఈగొడ్డురాలికి బిడ్డలతీపి యెక్కడ ? (ప్ర) చిత్రాంగీ !

ఉ. నల్లఁగనున్న నీరమని నమ్ముము దెల్లగనున్న బాలుగా
నుల్లమునందు నమ్మ సుతుఁడామక భర్తను జీరకొంగునన్
బెల్లుగ నేర్పుమీఱ ముడివేసితివం చనృతంపువాక్యముల్
కొల్లలుగా వచించి యిటు ఘోరముఁ జేయఁగ నీకున్యాయమే.

ఇంతకింత మాటగట్టుకొన్నట్టు ముంచున్నది. నవ్వుతోఁ జేసి నెత్తిమీఁదికివచ్చి నప్పుడేడ్చుచు ననుభవించువారెందఱు లేరు. ఓ దైవమా !

శా. నీకుంజుట్టమె దాఁచనే మొసఁగెనో నీ సంతతిన్ సాఁకెనో
యేకట్నంబును గప్పెనో తలఁపనేదేఁ ద్రవ్య మెత్తించెనో
యీకారుణ్యవిహీన నాపవతి యిస్సీదీని చుట్టంబవై
నాకుఁ గూర్తువె కష్టసంఘముల నన్యాయంబుగా నయ్యరో !

చిత్రాం—ధిగ్జంతుఁడు నీవాఁడననేమి ? నావాఁడననేమి ? న్యాయంబు పక్షంబు వాఁడు మహాపతివ్రతా శిరోమణిని నన్ను బాధింప నాయుసురూరక పోవునా ?

రత్నాంగి—

క. కులముద్ధరించువాఁడు కు । లమేలఁగ నున్నవాఁడు తిప్పెడి నీక
న్నులు చల్లపడఁగ దయిలం । దలకుం జుట్టుకొని తిరుగుతగును నటించున్.

కన—ఉ. అమ్మక చెల్లెనారివయి యారయ నాపతిపాల మారివై
తిమ్మహినీవు పట్టినది యెల్లను బంగరు నయ్యె వీరి ప్రా
ణమ్ములుకూడనిట్టి తఱుణంబున నీయరచేతనుండె ప
క్షంబునఁ జేయి పెట్టుకొని గాంచుమునిద్దుర నీవహర్నిశల్.

చిత్రాం—ఓసీరత్నాంగి ! కనకాంగి ! మీకండకావరంబింకను తొలఁగలేదా? చూడుము మీపాట్లు —(అనునఘోక్తిలో)

రత్నాం—

గీ. కొడుకుదక్క వేడుచుంచు వడఁకుచుంటి । నింతదనుకింక సుతిహీనయేనుపడక
సొమ్ములున్న పురంధ్రికిఁ జోరభయము । గాని లేనిదానికి నుంతగొనఁగలదె.

చిత్రాం—మీతోడ నాకుఁ బనియేమి? మీరిద్దఱు కట్టకట్టుకొని గంగలో దూకుఁడు.
మీమొగములు చూడరాదు నేనుబోయెద (నిష్క్రమించును.)

రత్నాం—హా దైవమా;

ఆ. కూఁడు గుడ్డలేక కొఱవిదయ్యంబుల । చెంతఁ గాపురంబు సేయవచ్చుఁ
గాని బ్రతుకుగూర్చి కంటనీరును బెట్టు । సవతితల్లియొద్ద సలుపరాదు.
కావునఁ బగవారికైన సవతితల్లి యెన్నటికి వలదు.

కన—

గీ. వనమునకుఁబంపె నీరేడువత్సరములు । తిరుగుమంచు రాముని గైకసుతుని ధ్రువుని
దపముసేయఁబంపె సవతితల్లులగుట । గాని యింతఘోరంబేరుఁ గాంచలేదు.

రత్నాం—కోడలా! ఇఁకెఁ జూడఁబోయి చూడఁబోయి నాతనయునిఁ జూడలేము.
ఈజన్మమునకుఁ గడసారిచూపు చూచెదముగాక పోదము.

కన—అయ్యో! దైవమా! నీవింక మాకులేవా? (ఇద్దఱు నిష్క్రమింతురు.)

(తలవరులతోడ సారంగధరుఁడు ప్రవేశించును.)

దీర్ఘ—ఓరీ బావా! వక్రదంతా!

ఆ. విఱిచికట్టుటందుఁ బెడ రెక్కలనుబట్టి । చఱుకుతోడవీపు చఱచుటందు
నాక్క వ్రేటుతోడ గ్రక్కున మెడఁద్రుంచు । టందుఁబండితుల మీఁ రెందుఁగలరు.

వక్ర—అవునుగాని యీస్వామినిఁ జూడఁగా జాలిపుట్టుచున్నది. (తెలియక) హా.
కొడుకా! హా దేవుడా!

సారం—

ఆ. కొడుక కొడుకయంచు గోలపెట్టుచునమ్మ । దేవుఁడా యనుచు నదేపనిగ న
డలుచుఁగొమ్మ కటకటా వచ్చుచున్నారు । శోకమిట్లు గాంచె నాకృతులన.
వీరిమోములనెట్లుచూడఁగలను. చూడకతప్పునా?

రత్నా—హాతనయా! ధృతతనయా!

సీ. జ్యోతిష్కులరుదెంచి జాతకంబుఁగాంచి నూఱేండ్లుమనునంచు నుడివినారు
సాముద్రికులువచ్చి జయరేఖలను గాంచి వసుధనేలునటంచుఁ బల్కినారు
పార్థివుఁ డేతెంచి వదనపద్మముఁగాంచి శ్రేష్ఠుఁడగునటంచుఁ జెప్పినారు
ప్రాజ్ఞవర్యులువచ్చి రత్నాంగినోచిన నోములపంటంచు నుడివినారు

గీ. గాని యొకరైననింతలోఁ గానిరెత్తి । పడయునంచు ముందునరసి పల్కరైరి
కొడుక వారు సుఖప్రీతికొఱకునిట్లు । లాడియుండిరి కాఁబోలు నదృతములను.

చ. పాల తుకమాయ చేఁబలుకు బోఁకుల భారమణుండునమ్మి యే
వలనను తప్పులేని పసిబాలు కరాంఘ్రులఁ గోయుఁడంచు వ్యా
కులమును జెంద కాజ్ఞనిడఁ గుత్సితురాలు సపత్ని పెట్టుమం
దులు తలకెక్కఁగానియెడ దోసములిట్టివి యెందుఁగంటిమే,

సారం.—అమ్మా! నీవిట్లు విచారపడెదవేల? శాంతింపుము.

చ. ధరణిపు దూరకమ్మ పినతల్లిని నీసునఁ జూడకమ్మ నా
కరణిననుంగు నెచ్చెలులఁ గాంచుచునుండఁగదమ్మ నీకు నా
కు ఋణముదీఱెనంచు నిఁకగుండెను రాయిగఁ జేసికొమ్మ మం
దిరమున నుండుమమ్మ మది దీనత శోకిలకమ్మ యిమ్మెయిన్.

నన్ను మఱచిపోయి నావాక్యంబుల నొక్కటి మఱవకయుండుము. అదియేదియన,

చ. అతిభరమైన యాన కడుగైనను దాఁటవు దేనినమ్మిరో
సతతము పాదసేవనము సల్పుచునుందువు దేనినమ్మిరో
యతివ నొకర్తు దెచ్చినను నాత్మనుగొంకవు దేనినమ్మిరో
సుతుఁబలి చంపఁబంపెనని యంతయు దూరకు దానినమ్మియే.

ఇంతియేగాక నామరణంబునకు మా పిన్నమ్మగారే కారణమని యెంచకుము. ఏలయన.

చ. నిలుపుదునన్న నాయుసురు నీవు సమర్థతఁ బొందనట్లు నా
విలయముకై సపత్ని యొకవేళను గాంచిన శక్తిగాంచఁబో
దలఁకను బూనక మెపయి నాత్మజు కర్మఫలంబుగా మదిం
దలఁపుము మంచిచెడ్డలను దల్లిజనమ్ములు సేయనేర్తురే.

కన.—హా ప్రాణేశ్వరా!

సీ. నూనూఁగు మీసాలు గాననా వేలనే యాయువు సరియౌట నరయనైతి
గలనైనఁ బలికి బొంకని నిన్ను మోయఁగఁ బృథ్వికిన్ బరువౌట నెఱుఁగనైతిఁ
గన్నెఱ్ఱగానుండి కామించిపిన్నత్త నిన్నిట్లు వెతబెట్టు టెన్ననైతి
మీమాతమీనారి నీమాడ్కి దుఃఖవార్ధిని బడఁద్రోయుటఁ దెలియనైతి

గీ. నక్కటా యేమితెలియని యబలనైతి। నొక్కవేళైనవచ్చి నిన్నొనఁడయ్యె
నింక సేయుదైవంబు నేనుగొల్తుఁ। గష్టములఁ బాపుదేవుండు కలఁడొ లేఁడొ,

నాథా ! పరిణయసమయంబున,

చ. గళమునఁ దాళిబొట్టులిఁగట్టెడు దిట్టమునందు మత్తపః
ఫలము ఫలించెనింకఁ గోఱవానెను ధన్యతఁగంటినంచు నే
దలఁచితిఁ వ్యర్థమయ్యెనది తానొకటెంచఁగ దైవ మొక్కటిం
దలఁచునటన్న వాక్యమె యథార్థముగాఁ జనె నేమిసేయుదున్.

సారం—

గీ. మృగయుభంగిఁ గారుణ్యంబుమిగులమదినిఁ । బొలఁగికటకటా నీదుగొంతునకు బిగువు
గాఁగఁబోసిన యురిత్రాడుగానియిద్ది । కాంతమంగళసూత్రంబు కాదుకాదు.

సుబు—(ప్ర) అయ్యో! మిత్రమా! నీయవస్థ యెంత సంతాపకరంబయినది.

సారం—సఖా ! సుబుద్ధీ ! వగవకుము.

చ. కనులనుగాన నెవ్వరికిఁ గాని విపత్తును జేసినాఁడనో
మునుపటిజన్మమందు నదిమూడెను దప్పక నేఁటిరేయితో
వనజభవుండు వ్రాసిడిన బత్తెము చెల్లెనుగాన నింక నే
మనఁగలవయ్యె నీకుఁ జెలి మాతకు బిడ్డఁడుఁ గాంతుఁడాలికిన్.

ఇంతకు జననమరణంబులును వియోగసంయోగంబులును ప్రాణులకు నైసర్గికంబులుగదా ! మనమేమి చేయఁగలము.

సు-సీ. అనుఁగుసంగడికాఁడయని కడ్పులామాట ని కేరునాతో వచింతురయ్య
ర—అన్నయనుచుఁ బిల్వనాదట నెవ్వారిఁజేరి సంగము నెంతో సేసికొందు
క—నెవ్వానిపాదంబు లింక నే భవవార్ధి నౌకగానిచ్చలు నమ్ముదాన
ను—మంచిచెడ్డలఁజెప్పుమంచు నింకేరునాపాలికి నిరతంబు వత్తురయ్య

రత్నాం—

ఆ. ఏనిచుంచుదువ్వి యెల్లలోకంబుల । నేలినట్టులింక నింపుగొందు
నేనినింకనాదు ప్రాణంబుకంటె ని । శేషమునకఁదలఁతుఁ జెప్పుమయ్య.

మత్తకోకిలలు.

రత్నా—ఏలసంపదలేలభోగము లేలజీవన మేలరా
పాలుకారెడు ప్రాయఁపాపినఁ బ్రాణమేగతి నిల్చురా

సారం—మేలువచ్చును గీడువచ్చును మేదినీశులకేనియున్
గాలకర్మముచేత దానినిఁ గాంచకుండఁగశక్యమే

సుబు — మున్ను సాఁకెదు నేఁడనంచును మానసంబున నమ్మితిన్
వమ్ములయ్యెను వాంఛలన్నియు వంధ్యసూనుని కైవడిన్

సారం — ఇమ్మహీస్థలిఁ గోరినట్టుల నెవ్వఁడేనియుఁ బొందునా
తమ్మిపుట్టువు వ్రాలుచొప్పునఁ దప్పకన్ నని నమ్ముమా

కన — ఇంతలోపల నింతలౌనని యెన్నఁడేననుకొంటినా
వంతఁ బెట్టఁగ దమ్మిచూలికి వైరమేమి తలంచితిన్

సారం — సుంతయేనియు ముందు కార్యముఁ జూడశక్యమె యేరికిన్
భ్రాంతిఁ జేసిన పాపమొందఁగ బ్రహ్మదూరఁగఁ బాడియే.

సుబు — ఆలు సెప్పిన పల్కు నమ్ముచు నాత్మజాతుని నీగతిన్
గాలు సేతులఁ గోయఁబంపెను క్ష్మాతలేశులఁ గంటిమా

సారం — కాలుబుద్ధిని నీతిసెప్పిన రాజరాజనరేంద్రునిన్
బోలదూరఁగ నీకుఁ బాడియె పుణ్యపాపములెన్నవే.

సుబు — వారివీరిని దూరలాభము వచ్చునే యిసుమంతయున్
సారెసారెకు నిన్నుచూచిన సంభవించెడు శోకముల్.

సారం — పోరిపోరున నిట్టులేడ్వఁగ బొందకుండునె కష్టమున్
వీరులాపదవేళ ధైర్యము వీడియుండుట ధర్మమే.

సుబు — మిత్రమా! నీవెన్ని చెప్పినను శాంతించుట దుస్తరము.

సారం —

క. ఎన్నెన్నో చందంబులఁ । గన్నీరిలమీఁద నదులగతిఁ బారఁ నో
యన్నవగతు యద్దృష్టం । తన్నష్టమ్మను బుధోక్తి తప్పునె యెందున్.

మిత్రమా! మీరాత్మకుఁ గుందుచుంటిరా లేక యీపాడు మేనునకుఁ గుందుచుంటిరా? పాడు మేనునకైన —

గీ. ఆత్మ బాయ పిదప క్షణమైన నిలువ । నిని యీదేహమునకు మీ రేడ్వనేల!
ఆత్మ కేయయినచో —
గగనరీతిని నాశంబుఁ గనని యాత్మ । కిటులనంతకుమున్నె మీ రేడ్వనేల!

కావున మీ స్వాంతంబులందలి చింతదొలంగుఁడు.

రత్నాం — హా! తనయా! దుఃఖదావానల దంద్యమాన మానసులకేమి చెప్పిన నేమి లాభము? మాకు గతియేది?

సుబు—ప్రాణసఖా! ఛిద్రఘటంబులలోని జలంబు చందంబున మాశోకాకుల మానసంబుల నీసదుపదేశంబులు నిల్వకున్నవి.

సారం—(తనలో) హా దైవమా! వీరి కంతకంతకు వంత హెచ్చుచున్నది.

సీ. ఏపాపమెఱుఁగని యాచిన్నతనమున వచ్చిననిందకై వగతునొక్కొ
కనిపెంచి పెద్దవానినిఁ జేసి యుబ్బంగి వందురుతల్లికై వగతునొక్కొ
అర్ధాంగలక్ష్మియై యలరారి పెనువగ పాలైనభార్యకై వగతునొక్కొ
మఱపునకైనను మఱువక వెన్నంటి వనటనొందుచెలికై వగతునొక్కొ

గీ. దేనికనిచింతనొందుదు నేనుగాన । నిందవడబాపి మాతృపత్నీ సుహృద్వి
శ్లేషమోహ లతాచ్ఛేదసిద్ధవరముఁ । బరమకరణ నొసంగుమా పరమపురుష.

ప్రస్తుత సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనంబులచే వీరిదుఃఖం బుపశమింపఁ జూచెద. (త) అమ్మా సూర్యాస్తమయమగుచున్నది. అటుచూడుము.

గీ. సమయకీరంబుచంచూపుటమునందు । యస్తగోత్రంబుమీఁదుగా బ్రస్తమైన
యరుణబింబంబుతో యనసరుణబింబ । మపరవారాశిలో వ్రాలెనదిగో కంటె.

రత్నా—(అటుచూచి) నాయనా!

సీ. లోకబాంధవుఁడౌట లోకులకష్టంబుఁగనిసైపలేనంచుఁ జనియెననఁగఁ
గలనైనవెతలెఱుంగని బాలుకతలెల్ల వేల్పులకెఱిగింప వెళ్ళెననఁగఁ
గర్మసాక్షినిదన్ను మర్మంబునదుఃఖ పోయిరిసీయంచుఁ బోయెననఁగ
సారంగధరుఁ గ్రమాచారంబు సారంగధరునకుఁ జెప్పంగ నరిగెననఁగ

గీ. నినుఁడు దుఃఖాబ్ధిలో మగ్గనినుఁడనేను । మనుట యేటికిఁ జపరాబ్ధి మునిగెననఁగ
వనజమిత్రుండు గ్రుంకె దుర్దినములందుఁ । బ్రజలకెక్కింతయును గానరాఁడనంగ.

సారం—(తనలో) ఊరడింపవలయునని ఏదియోచెప్ప నీమె యాసంబంధమాత్రము విడువలేదు. పోనిమ్ము. నామిత్రుని మఱపింపఁజూచెదను. (ప్ర) మిత్రమా సుబుద్ధీ!

సీ. ఎలమిరేకాపు లేయెండ పైరును బెట్టబోలఁజల్లిన విత్తనాలనంగ
వేల్పులత్రోవయఁ విస్తీర్ణవనములో లీలశోభిలుమల్లెపూలనంగ
సమరయోరుజవరుండు సంపాదనముజేసి యమ్మబెట్టినయుత్తియాలనంగఁ
గాలశాపాయుధ కరపద్మమునసుండు మంజులస్ఫటికాక్షమాలనంగ

గీ. శార్వరీ చంద్రుల వివాహసమయమందు । గ్రాలజల్లుకొనెడు తిలప్రాలనంగ
దారలలరారె నలరాజు తలిరాఁగ । ఖచరలిచ్చు కుముద కోరకాలనంగ.

సుబు—మిత్రమా అటుకాదు వినుము

ఆ. అలితప్పఁగాన కాశ్మజాదండింపఁ । దగదురేనికంచు గగనమనెడు
నల్లపలకమీఁద నాకుబ్రాసిన । యక్కరాలనంగ రిక్కలొప్పె.

సారం—(తనలో) ఇతఁడును మాయమ్మగారిదారినే యవలంబించినాఁడు. ఏమిచేయుదును కానిమ్ము. ఏమియుఁదెలియని నాయింతినయిన నూరడింపఁజూచెదను. (ప్ర) సఖీ! చూడుము.

సీ. అమరలోకాధీశ హర్మ్యాగ్రతలమున నిలిపినసౌవర్ణ కలశమనఁగ
సమయభుజంగుండు శక్రదిక్కాంతికుఁ బంపినవెలలేని పవడమనఁగ
యామినీమానినియలికభాగమునందుఁ దీర్చినకాశ్మీరతిలకమనఁగ
వనమాలిపదమను వనములోవిలసిల్లు సరిలేనిరక్తక స్తబకమనఁగ

గీ. నాటలను సల్పు బాలజయంతుహస్త । పద్మముననుండు రతనాలబంతియనఁగ
శశితమంబుఁబాపిచెలంగె సంకటంబుఁ । బాపిసౌఖ్యంబునిడువానిభంగిఁబడఁతి.

కన—

గీ. తనదుగోత్రపయోరాశి జననమగుట । గాక తనదునామంబునఁ గ్రాలువాని
బామఁ బెట్టుదురేయంచు మోముఁగంటు । పెట్టుకొనెనని నెఱ్ఱనైనిమఁడువోఁచె.

సుబు—

ఆ. కన్నతల్లిచేసికొన్న కళత్రంబు । చాయఁబోలితిరుగు సఖుఁడువగవఁ
బాపదూరుఁ డెట్టి బావించెదననియేచ్చు । జ్యోత్స్నయుత్రిలనఁ దుషారమొప్పె.

సారం—(తనలో) హా దైవమా! వీరిలోఁ దక్కువ దుఃఖంబు గలవారెవ్వరు? మువ్వురు మువ్వురే? ఎవ్వరినోదార్తును? వీరికి ధరాతలంబంతయు శోకస్వరూపంబుగాఁ గన్పట్టుచున్నది.

రత్నాం—తండ్రీ! సారంగధరా!

గీ. పిన్నతనమందు బొమ్మలపెండ్లికరణి । నీకునీమెకుఁ జేసిన నీదుమామ
యల్లుఁడేడియంచడుగ నేమందునన్నఁ । గడుపుపగిలి దుఃఖపడకెక్కరణినుండు.

శివశివా! యీదుఃఖంబును గన్నులారఁ గాంచఁజాలను. కావున నెటులనో ప్రాణపరిత్యాగంబును జేసికొనియెద.

సారం—(చెవులుమూసికొని శివశివా! అమ్మా!

ఉ. అచ్చుగ భూమిపైఁబడినయప్పుడు ప్రాణము వాసెనంచు నో
చొచ్చియు గర్భవాసమున సూనుఁడు పుట్టనెలేదటంచు నో
యిచ్చదలంచి యూరడిల కిట్టులఁబావఁ దలంతువయ్యయో
చచ్చినవారితోడఁ బసిచత్తురె కాలము చెల్లకెవ్వరేన్.

తొల్లి పుత్త్రదుఃఖ మనభవించినవారి నెందఱిని వినియుండలేదు.

సీ. పదిపైన నాలువెంబడిన గాదిలికుఱ్ఱ మృతిఁజెందఁగ సుభద్ర బ్రతుకలేద
వరపుత్త్రులేవురు పంచత్వమునుబొందఁ దలయెత్తికొనికృష్ణ మెలఁగలేద
కడుపెడుకొడుకులు మడియంగ గాంధారి కాలంబునెట్టుటో గడపలేద
బిడ్డలునూర్వురు పెద్దనిద్దురఁబోవ నుసురరుంధతబొంది నుంచలేద

గీ. పుత్త్రసుఖము నొందినవారె పుత్త్రదుఃఖ। మొందుదురు కర్మవశమున నిందునకు నొ
కండుమందునకు మఱియొకండె కాన్పు । పేర్మిదోనెడునీళ్ళలో పీకు నేఁడు.

రత్నాం—తండ్రి! మాటలెన్నయినఁ జెప్పవచ్చునుగాని కన్నకడుపుమంట చల్లారుట దుస్తరమౌగదా!

సారం—(తనలో) హా దైవమా!

ఆ. నిజము దేవుఁడొకఁడు నీళ్ళపల్లమొకండు । గానవిందకైనఁ గరము వగవఁ
గన్నకడుపుతీపిఁ గన్నీరుమున్నీరు । గాఁగ నడలునమ్మఁ గాంచివగతు.

(ప) అమ్మా! శోకమాపుకొనుట దుస్తరమే అయినను

ఆ. ఈడువారిలోన నిబ్బంగిఁదలఁతాయిఁ। జేసికొనియశంబు బాసినింద
కొడినిగట్టినాఁడ గొడుకుశోకమునకు। నట్టులీవునొడినిఁ గట్టుమమ్మ.

చ. ఎపుడుసవిత్రిగేహమున కింపుగ నీతనయుండు వోయెనో
యపుడెయశశ్శరీరమొకటా చననింకను హేతుమైన యా
వపువును స్నమోహమును బాయకనిల్పఁ దలంతుగాని పా
పపుఁదను విద్ది సీయనుముఁ బ్రాజ్ఞులు మెచ్చఁగ రోయ వేలొకో.

రత్నాం—తండ్రీ! తలయెత్తి యొకసారి నావంకఁ జూడుము.

సారం—

గీ. కన్నదేవాలయంబుల కన్నిటికిని । నొరగిపడరానిపాటుల నొందినన్ను
గనిన మీబుణ దీర్చుకొనమిపాటు । పడుచునుండ మోమెటులెత్తువాఁడతల్లి.

దీర్ఘ — అమ్మా! మీరంద ఱిటనుండుఁడు. ఈసంగతి రాజుగారికిఁ దెలిసిన మా నోటికడ కూడులోమన్నుపడి యాకింకరవృత్తిపోయి యన్నమో రామచంద్రా యనుచుఁ బొట్టఁజేతఁబుచ్చుకొని యూరూరు తిరుగుచుఁ గాశియో రామేశ్వరమో పోయి మఠాలు సేవింపవలయును; రాజాజ్ఞయా మఱియొకటియా?

రత్నాం — నాయనలారా! మీకు బిడ్డలు లేరా?

దీర్ఘ — లేకనేమి? కూడులేనప్పుడు బిడ్డలకేమితక్కువ హా విధీ.

ఆ. విత్తవంతులకును బిడ్డలనీయక । మెతుకులేనివారి మెడకుఁజుట్టు
నెన్నఁగాఁ బురంధ్రికీయ కాయుష్యంబు। నిండ్లకొలఁది విధవ కిచ్చునటుల

(సారంగధరునివంకఁజూచి) అయ్యా! మనము వేగమే పోవలయు.

సారం — మంచిది. ఓ కాంతామణీ! యిటురమ్మ. (పగ్గరకుఁదీసి)

సీ. మగఁడు పోయిన స్త్రీమలపరిచర్య యెందులకని యీసు నొందఁబోకు
ధవుఁడులేనప్పుడు ధవుని సేవకులేల యంచువారలఁ దూలనాడఁబోకు
ప్రియుని మృత్యువునకుం బ్రియయత్త కారణం బనిరోషమున నామె నరయఁబోకు
నను స్వరిలోపలఁ దలవంపుఘటియించెనని దైవమునుదూర నాడఁబోకు

గీ. పతివిహీనను నీవింకఁ బ్రతుకుటేల। యిస్సిరోయంచుఁ గాయంబు నేడఁబోకు
సుతుఁడులేఁడను లోపంబు నుంతయైన। నాజననికిలేకుండంగ నడుపుమబల.

తల్లీ! మానినీమతల్లి!

సీ. ప్రియుని కారుణ్యంబె పెన్నిధానమటంచు నిరతంబుభావించు నిర్మలాత్మ
తానెఱింగినయట్టి ధర్మంబులొరులచే నైతంబు డపించు సదయహృదయ
పరుల కాంచనమేనిఁ బరికించిలోష్టంబు చందానఁదలఁచెడు సత్యశీల
సర్వజనస్తుత సద్గుణావళులను భూషలుగా నెన్ను పూతచరిత

గీ. సుమ్మ నీదుకోడలు దీని నెమ్మినెట్లు । సరసెదో చేతిలోఁజేయి నప్పగించి
నా శిరంబుపై భారంబు నీ శిరంబు । పైనిడి చనెదనింక నీ భారమమ్మ.

మిత్రమా!

గీ. వీని పిన్నమ్మపైనుండు పెద్దకినుక । వీనిపయి వీనియందలి ప్రేమనాపై
యందు నిల్పుమమ్మనుమీయటంచుఁగొమ్మ। నుమ్మియంచు వేఱుగఁజెప్పఁజాల్మినీకు.

రత్నాం — కుమారా! ఒక్కసారి దగ్గఱకురమ్మ.

వర్త—అయ్యా ! ఆలస్యంబగుచున్నది. మనమేగవలసినవారము గాని మఱియొండు గాదు. దూరంబుపోవలయు; మీరిక్కడ నున్నంతదనుకమిమ్ము వీరు విడువఁజాలరు కావున నరుగుదమురండు.

సారం—మంచిది వచ్చుచున్నాఁడను.

సుబు—

ఉ. అంగదఁబాపుచంద్రధర యంశజమై యిటువిమ్ము గమ్మ చి
త్రాంగి మదోగ్రకుంజరము దర్పముచే నెదురెందులేక ర
త్నాంగిపురంధ్రిగర్భ సలిలాశయమందునఁ గ్రాలుచున్న సా
రంగధరాబ్జము న్మొదలంటఁగఁ ద్రుంపఁగనుండె గావునన్.

రత్నాం—తండ్రీ తుదకొక్కసారి చేరరమ్ము.

దీఘన—అటులవచ్చుటకు వీలులేదు.

సుబు—హా! హతదైవమా ఈరత్నాంగిదేవి—

మ. నవమాసంబులు మోసి కాంచి యెపుడైనం గావు కావంచు నే
ద్యవడిన్ గన్గొని పాలనిచ్చికనులన్ బక్కుంబు లట్లోముచున్
బవలున్ రేలును బెంచినట్టితనపాపం గన్న మోహంబునన్
కవుఁగింటన్ గడెకాలముంచుకొను భాగ్యం బేనియున్ నోచదే.

ఓయమ్మా ! రత్నాంగిదేవి !

మ. ఎవనిన్ బంగరుటుయ్యెలందునిచి హాయిన్ జోలలం బాడితో
యెవనిన్ లోకులు మంచివాఁడనఁగ లో నేవేళ నుప్పొంగితో
యెవనిన్మీకు నివాహవారివిధునం జేబెంచితో సీతనూ
భవు వానిన్విడనాఁడ గావలసె దౌర్భాగ్యంబు నా నిట్టిదే.

సారం—ఓసుబుద్ధీ! ఏల యిట్లుపల్కెదవు ?

ఉ. అంబుల నూరువల్లియుల నద్రిలనన్నిటి ముంచియుత్తి భీ
మాంబుధి భంగివచ్చు నది కడ్డుపఁగట్టవుగాక యక్కటా !
యంబువమట్లు దోఁచి మఱియంత ప్రవాహముఁబాఁజేయు—
పఙ్క్తుల నొసంగుచుంటవిది ప్రత్యుపకారము సంగడీనికిన్.

ఏ. కనదురుకీలమూలికలఁ గల్గినకీలిని నొక్కచేత వీ
వవఁగొని లెస్సఁగా విసరి పాయక వేఱొకచేత నేయివో

సీ.గతి నాపరాని పెను సిగ్గులు గుండెలు మండుచున్న యీ
వనితలకున్ మతిఁత పగవాటిల జ్ఞప్తికి నేదో తెచ్చెదే.

అదియునుగాక.

చ. ఎడరొకయింత రాఁగ ధృతియెల్లఁ దొలంగుట గాక యంగముల్
వడఁకెడు నాడువాండ్రకు నుపాయమునన్ ధృతిఁ బాదుకొల్పి యే
డ్పుడుపక వారితోఁ బగచు చర్విషయింబకు దిట్టిధర్మమె
య్యెడఁ బురుషోచితంబగుని యీవు గ్రహింపని ధర్మమున్నదే.

రత్నాం—ఓ కింకరులారా !

చ. పలుకఁగఁ దప్పులేని పసిబాలుని దారుణభంగిఁ గాలునే
తుల దయమాలి ఖడ్గమునఁ ద్రుంపఁగ మీకెటు జేతులాడునో

సుబు—అమ్మా ! ఎంతవెఱ్ఱిదానవు.

యిలఁ గులవర్ధనున్ గొడుకు నిట్టులశిక్ష విధింపఁ దండ్రికిన్
బలుకఁగ నోరెయాడఁ బెఱవారికి వీరికి జేతులాడవే.

సారం—అమ్మా ! నేనింకఁ బోయెదను. విచారమును బాలింపుము.

క. యూపగతపోతమును గాంచి యోర్వలేక । కడుపుచెఱువుగా వ్యసనంబుపడెడుతల్లి
మేకవలెనున్న యోయమ్మ! మీసుతుండు। మొక్కుచున్నాఁడు కడసారి మ్రొక్కుగొమ్ము

(తలవరులతోఁడ నిష్క్రమించును.)

సుబు—మిత్రమా! నేనువచ్చెదను. (నిష్క్రమించును)

రత్నాం—తండ్రీ! సారంగధరా !

ఆ. కనుల కలవుదీఱఁ గడసారిచూడ్కిని । స్నరయు నక్రకలను లడ్డమయ్యె
హృదయమందు వెలుఁగు సదమలజ్యోతిని । నరయుమాయ యడ్డమయినయట్లు.

కన—(క్రిందఁబడి) హానాథా! దిక్కులేనివానినిగా నన్ను జేసిపోవుచుంటిరా ?

చ. పవనము లేనితావులను భర్తకు పీవనభంగిఁ దిగ్మముల్
మివులఁగఁ గాయుదిట్టముల మేలగుచ్ఛత్రము మాడ్కినుండి యెం
దు విభుఁడె జాయకున్ వశ్రము నోమని నీడను బోలెనుండు నా
కు విబుధులార! వేగమునఁ గూరిమిచేఁ బతిభిక్షఁ బెట్టుడీ.

రత్నా—

సీ. అమితప్రమోదరత్నాకరమువ్వాంగఁ బుత్త్రుఁడేకువలయ మిత్రసముఁడు
అదిదారుణతాన నాన మార్చంగఁ దనయుఁడే ఘనవృష్టి ధారసముఁడు

కమనీయవిగ్రహా కాసారవనమున కాత్మకుమారుఁడే యబ్జసముఁడు
పున్నామ నారక భూమిధ్రమునకన్నఁ గొమరుఁడే భీమణకులిశసముఁడు

గీ. పరువవాక్యాళుగనికరవ్యథలఁబాపఁ । గన్నఁనూనుఁడే నిస్తంద్రకవచసముఁడు
అట్టిపసిపాపనెడఁబాయ నయ్యెనింక । కన్నకష్టంబు నావేలోకంబుగలదె.

(తనలో) నేనేడ్చిన నీమె మఱింత కడుపుపగిలి యేడ్చును! కావున నేడ్పుమాని యూరడించెదను. (ప్రకాశముగా) అమ్మా! చింతింపకుము. మాజన్మమే దుఃఖభాజనము. నాయట్టి యభాగ్యురాలకుఁ గోడలవు కాఁబట్టి యిట్టి కష్టంబు కలిగెను. నీవేడ్చుచుండ నాకడుపులోని ప్రేవులన్నియుఁ దఱుఁగుకొనిపోవుచున్నవి (తనలో) ఓదైవమా!

గీ. పతియలక్ష్యంబుసేయ సపత్నిదెప్ప । చన్నమును బెట్టనోర్తు నెల్లైనఁగాని
పామునకునున్న యేండ్లున్నబాలవిధవఁ । గోడలనుగాంచి యెటునోర్తు నేఁడు పేద.

(ప్ర) కోడలా! ఇక్కడ మనయేడ్పు విని యూర్చువారెవ్వరు? తీర్చువారెవ్వరు? నీవు నన్నూరడింపవలయును. నేను నిన్నూరడింపవలయును, నీకుఁ దల, నాకుఁగడుపు. మనరోదనం బరణ్యరోదనంబు. కనుచూపు దూరము పోవుదాఁక నాపుత్త్రునిఁ జూడఁబోవుదము.

(కనకాంగితో నిష్క్రమించును.)

గద్య—ఇది అష్టావధాని విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వర
ప్రణీత సారంగధర నాటకమునందలి
పంచమాంకము.

---



# సారంగధర నాటకము.

## షష్ఠాంకము.

---

అరణ్యము.

(సారంగధరుఁడు సుబుద్ధి, తలారులు, ప్రవేశించుచున్నారు.)

సుబు—

గీ. సౌధములమీఁద నెక్కి రజంబడంగ । గవాక్షాంత చందంబునఁ గంటినీరు
విడలఁ గాంతాగణము పెద్దపెట్టుగాఁగ । నడలుచుండె సారంగధరాయటంచు.

అట్టి యార్తధ్వని వినుచుఁ బురంబు నతిక్రమించి యిచ్చటకుఁ జేరితిమి. డెందంబును సహస్రశకలంబులం జేయుబాపము నుందేయున్నది.

గీ జీవమా నీదుజీవమై చెలఁగుసఖుఁడు । వాసిపోవుచుండఁగ నేమి బాపుకొనఁద
లంచి యీమొండిమేనును గొంచమైన । విడువకున్నావొ యడియాసవిడిచిపొమ్ము.

దీర్ఘ— మంత్రికుమారా! మాకృత్యంబును మేము నెరవేర్పవలయును. కావున మీరిచ్చట నింక నుండఁగూడదు. ఏలయున,

గీ. పాడెపైఁబోవు కుణపంబు వత్ససంధ । వంబు నక్షత్రపతనంబుఁ బరమసాధు
సంఘ జీవహింసంబును జనులుచూడ । రాదు గావున వేగఁదరలుఁడు మీరు.

సారం— ఔరా! విధిచే యిది యెంతకుఁ దెచ్చెను.

సీ. కలిమిలేములనొకే కైవడివెన్నంటి నీడపోలికనుండు వాఁడుహితుఁడు
ప్రత్యుపకారంబు భావమం దెన్నక భద్రంబులనుగూర్చు వాఁడుహితుఁడు
దుర్వ్యపోకలనుండి తొలగింపుచు ప్రశస్తపథములందు నిలుపువాఁడు హితుఁడు
కాసంతినొవ్వ జగాలన్ని మునిఁగిన భంగినిదురపిల్లు వాఁడుహితుఁడు

గీ. పలిపిన రవంత మేలు కొండలుగఁ జేసి । పలువురకుఁ జెప్పి మఱవని వాఁడుహితుఁడు
ప్రియమునల్పముందున కంజవేయుస్వర్ణ । పర్వతము మెట్టినట్లుండు వాఁడుహితుఁడు.

అట్టిహితునిఁ గాలకర్మవశముచే వీడవలసివచ్చినది. మాన్యుఁడు దమ్మని పలుకుటయేగాని పొమ్మనుట యెఱుంగను. ఎఱుగకపోయినను బ్రకృతావస్థను బట్టి పొమ్మని యనవలసివచ్చె. మిత్రమా! సుబుద్ధి! నీకీ సారంగధరుఁడు శత్రుడునుమా! మిత్రుఁడయిననేమి! మిత్రశత్రువులు వియోగ సంయోగంబుల యందు దుఃఖదాయకులే గదా? కాన నీదుఃఖదాయకుని మఱచిపొమ్ము. పొమ్ము.

మ.బా-శు. ఎట్టులనీవు సెప్పితటు లేనిక నీగెద నీకు నాకు నీ
పుట్టువునందు మైత్రివిడిపోయెను మిత్రభుజంబుఁ దీర్చఁగా
గట్టిగఁ గౌఁగలించుకొని కంజములీనెడు కన్నులెత్తిన
న్నిట్టులఁ జూడుమయ్య యిదియే కడసారిగదయ్య సెచ్చెలీ!

సారం—మిత్రమా! ఇదవరయ్యె పొమ్మా. నీవుపోయి మాతండ్రిగారికి నాకుబదులుగాఁ జేతులు జోడించి యిట్లు విన్నవింపుము.

సీ. రార నాతండ్రి సారంగధరా యంచుఁ జేరితొడలమీఁదఁ జేర్చినావు
మావానిభాగ్యమే మాడ్కినుండునటంచు నార్యులందఱి నడిగినావు
పనివానివృద్ధియే పరికింపమావృద్ధి యంచుఁ జెప్పలయందు నాడినావు
ఏఁ జెప్పుపలుకులకెంతెంతొ యలరుచు బాగుబాగంచు-బల్కినావు

ఆ. నీవె ప్రాణమీవె నిక్షేపమీవెనా! చేరఁగదయటంచుఁ జెప్పినావు
నీకు నాత్మభవుఁడు నెఱవేర్పఁదగిన కృ । త్యంబొకింత సలుపనైతివిదండ్రి.

తరువాత.

ఉ. అమ్మవచించుకార్యముఁ గన్నను నామె వచించునట్టి కా
ర్యమ్ము ఘటించెదం దొలుత నామెయు సెప్పదు నమ్మకన్నఁ బ్రే
మమ్మున నక్క గనుక్క సవతిమాడ్కిఁ జరింపక యుండునట్టి పి
న్నమ్మకుఁ జోతఁజేసి భవదాత్మజుఁడంచు వచింపవేడెదన్.

పిదపఁ బుత్త్రదుఃఖపీడితురాలగు మాయమ్మగారితో నిట్లుచెప్పుము.

గీ. పెంచపెద్దవానిఁ జేసి మంచిచెడ్డ । లెన్నొ గఱపినందులకు నీకిన్నినీళ్ళ
చుక్కలయిన వదలనట్టి మొక్కలీఁడు । కానఁ బుత్త్రుఁడా శత్రుఁడు గాకవీఁడు.

పదపడి యడవికి నేనువచ్చునప్పుడు పేరడలునఁ బుడమిపైఁ జతికలఁబడియేడ్చిన నాసతితో నావచనంబులుగా నిట్లు చెప్పుము.

గీ. వేళ్ళఁ జూపించుకొనక జీవించుదాన । వేమిచెప్పఁగావలె నీకు నెట్టులైన
గోడుమాని కన్నులు మూసికొనుచుఁ గాల । మొలివెళ్ళఁదీయుచు తలలూపుజనులు.

అంబువిమ్మట,

గీ. పేరుపేరువరుసఁ జేరి పౌరులమతి । మతియడిగితినంచు వచింపు మఱవరాని
చుట్టలందుఁ బెద్దలకెల్ల జోతలనియుఁ । జిన్నలకు దీవనలనియుఁ జెప్పుమయ్య.

మిత్రమా! ఇఁకఁ గడసారి మాట వినుము.

ఆ. చిత్తమొక్కటైన స్నేహితుండగువాని । కరయరానిదేది యట్టులగుట
నేమిచెప్పవలయు నేను నీకని యూర । కుంటి నిదియెకడకు నున్నమాట.

సుబు — హా మిత్రమా! ధర్మంబెచ్చటనుండునో యచ్చటనే జయముండును గాక. నేను పోయెదను. (నిష్క్రమించును.)

దీర్ఘ — వక్రదంతా! స్వామివారు చెప్పినమాటలు వింటివా? ఎందఱినో చూచినాము గాని యీయనవంటి ధైర్యముగలవారిఁ జూడలేదు. చావన్న నావంతయు వంతనొందఁడు ఊరుపొమ్మనియుఁ గామరమ్మనియు ననుచున్నవానికయిన మరణంబప్పు మరణంబుగానే యుండును. ఈయన సిద్ధపురుషుఁడా యేమి?

వక్రి — నీవన్నమాటయే నిజము. నాకు చేయి యాడకున్నది.

సారం-చ. కరచరణద్వయంబులను ఖండనసేయుఁడటంచు మిమ్ములన్
ధరణిధవుండు పంపె నది తప్పినఁ బాపమువచ్చు గావునన్
త్వరపడుఁడయ్య పూర్వకృతపాపము ప్రాప్తముకాఁగ మీరలీ
సరణిఁ దపింపనేల గ్రహచారము చాలనివాని కక్కటా!

మీరు క్రమ్మఱి మాజనకుని కడకేగవలసినవారు మీకృత్యము నెరవేర్పుఁడు మీకీవగపేల?

దీర్ఘ — అయ్యా! యింకవగపేటికి! మీవంటి సుగుణరత్నాకరు నక్రమంబుగాఁ జంపుడనియే మమ్ము బ్రహ్మదేవుఁడు పుట్టించినాఁడు కాని మీరు తప్పుచేసినట్లు తోఁపకుండుటచే ఖండించుటకుఁ జేతులు రాకున్నవి. అయినను నాలుగురూప్యంబుల సేవకావృత్తియందుండుటచే నకృత్యంబయినను జేయకతప్పదు సీ! సేవకావృత్తి యెంతదూష్యము! స్వామియేమి చేయుచున్నను బుణ్యపాపంబులనుజూడక చేయవలసినదే. లేదేని వృత్తికినీళ్ళు వదలుకొనవలసినదే.

సారం — ఊరకేల యేడ్చెదరు? నాయందలి ప్రేమచే ఖండింపకున్నారు. యేడ్పుమానుఁడు.

దీర్ఘ — యేడ్వకఁ దప్పదు. పుణ్యపాపంబుల నరయు పరమేశ్వరుఁడె మిమ్ముల రక్షించుఁగాక. (కాలుసేతులు ఖండించును.)

సారం — హా దైవమా! ఓతలారులారా! త్వరగాఁ జావకయున్నాఁడ మీకఠినకరవాలంబున శిరంబు ఖండించివేయుఁడు.

దీర్ఘ — శివశివా! మేమంత దుష్టచిత్తులమా? మీతండ్రిగారి శాసనంబగుటచే విధిలేక యట్లొనరించితిమి. అందులకే యింటినిండఁ బిల్లలుగల మేము మనుష్యులమో యాలి పాపిణాలు ప్రాణాలతోలేక గుండెలో రాయిపడినట్లున్నాము. శిరంబు ఖండింపఁజాలము.

సారం-చ. కరచరణద్వయంబులిటు ఖండితమయ్యెను గాని ప్రాణముల్
సరగునఁబోక వచ్చినను జావనివాని విధానమంట స

త్కరుణానుబూని ఖడ్గమునఁ గంఠవిలుంఠన మాచరించి యీ
యౌరిగనుఁగొండటన్న వినకుంటిరపుణ్యము గొడ్డువోయెనే.

దీర్ఘ — అయ్యా! ఇంక నీపాదుకలిలోఁ బుణ్యపాపవిచారమా? మీమాటవినమికిఁగోపింపకుఁడు; మేమిదే పోవుచున్నాము (తలవరులు నిష్క్రమింతురు)

సారం — తలవరులు పోయిరి. ఎవ్వరునులేరు దిక్కుమాలిన పక్షినైతి.

క. ఆ యమబాధలనొందితి । నా యమబాధలుదొలంగు ననుచున్ మందే
న్యాయమునఁ గండొ యిటుల । న్యాయములేకుండుఁగాతమని గొల్తుహరా.

అయ్యో! వాయువస్థ యంతకంత కతిశయించుచున్నది. ప్రాణములుమాత్ర మీపాడుబొందెను బాయకున్నవి.

ఉ. హీనుఁడు గానినిఁక వసియింపఁగ రా దని వైభవంబు లీ
దీనునిబాసె వెన్నెలలఁ దెల్లగఁబుచ్చెడు కీర్తిపోసె నో
ప్రాణములార నన్ను నెడఁబాయక వానిలు యాత్రమంట యె
ప్పా నగుబాటుగాదె మనఁ డంతటి పుణ్యమొనర్చినాఁడనే.

హా దైవమా!

గీ. రక్తమాంసంగోళియుడలిపైఁ బ్రాఁకుమక్షి । కా పిపీలికాదులఁ దొలఁగాగరంబు
లైనలేవు నడువఁగ లేవంఘ్రులట్లు । పదకరంబులులేనట్టి బ్రతుకు బ్రతుక.

ఇక్కడ నే నిక్కగాణి మిక్కిలిఁ బొక్కుచుండ నక్కడ మా వారట్లు గ్రుక్కుచుండిరోగదా?

మ. ఋణబంధంబులు నేఁటితోడఁ దెగెనా యిష్టుండ యంచిష్టుఁడు
న్మ్రణులన్ దీసిసభూషచేసితివె నన్నాథా యటంచాలియున్
జనకంబుల్ తినిచేతులన్ గదుగనోజందోఁచె నంచమ్మయున్
గణనాతీతములైన క్లేశములచే ఖట్వాల పెట్టుండిరో.

ఓతల్లీ! మానినీమతల్లీ! అమ్మా! ఇంక నమ్మరెక్కడ? ఆమెకుఁగూడ నపకీర్తిని దెచ్చితినిగదా! ఇఁక నెక్కడ యపకీర్తి? నేను రూపుమాయుచుంటిని గదా? మాసిననేమి?

గీ. నేనుజచ్చిన నాతోడ నిందజావ । దకట రత్నాంగి కాన్పిట్టిర నెదరపుడు
విషఫలంబుజారిన జెడ్డపేరుదాని । తోడవసుమతీజమునకు దొలఁగునట్లు.

ప్రాణంబులు పయనంబుగట్టుచుండ నింకను నాకీవంతయేల? కీర్తియైననేమి? నపకీర్తియైననేమి? చచ్చువాఁడ నేనేమిచేయఁగలను? ఇట్టిపట్టునఁ బరమేశ్వ

రచరణస్మరణంబే శరణంబు హరహరా ! ఆపద్బంధూ । దయాసింధూ ! హృద్యానవద్యవిద్యా ! తత్త్వమస్యాది మహావాక్య ప్రతిపాద్యా ! దుష్టశిక్ష శిష్టరక్షణదీక్షాకంకణా ! న్యాయాన్యాయ విమర్శనవిచక్షణా ! జగదుత్పత్తిస్థితిలయకారణభూతా ! నిజభక్తత్రాణవినోదనక్రియా కౌతుకోపేతా !

కవిరాజవిరాజితము.

వరవరదాయక మాధవసాయక నాట్యవిధాయక శూలకరా
వరమునిపోషణ దానవశోషణ పన్నగభూషణ చంద్రధరా
దురితవిమోచన ఫాలవిలోచన దోషవివేచన కామహరా
గిరిపరఖేలన కాలవిఫాలన కిన్నరపాలన పాపహరా.

ఉ. కానక తొంటిజన్మమునఁ గష్టము వేరికిఁ బెట్టినాఁడనో
కానఁగనయ్యె నిప్డది కానభవద్దయ వచ్చినట్టు లీ
దీనుని మొండివానిఁ గడతేర్పవొ మన్నవొ జాలిగొంచురా
వే నను డాయవే పరమభీతునిఁ గావవె లోకనాయకా.

మీన—(ప్రవేశించి) ఎవఁడో భగవంతునిఁ దలంపుచున్నాఁడు. బాధనొందినాఁడు కాఁబోలు? కానిచో నిక్కాలంబున భగవంతునియూరును బేరు నెవరుతలంతురు. వెదకి చూచెదనుగాక. (నలుదిక్కులు చూచి) ఇచ్చట నొక వికలాంగుఁడున్నాఁడు, మొగముపోలికజూడఁగా సారంగధరునివలె గన్పట్టుచున్నది. బాలకా ! నీ వెవ్వరవు?

సారం—మహాత్మా ! రాజరాజనరేంద్ర నందనుండ.

ఉ. మీరు సుపూజ్యులౌటఁగని మిమ్ము నెదుర్కొనఁ గాళ్ళులేవు జో
హారువులన్ ఘటింపఁగను హస్తములైనను లేవు చావకీ
తీరున మొండివాఁడ నయితిన్మునిసత్తమ యన్మనో సమ
స్కారముఁగొంచు శీఘ్రముగఁ జావఁగ మందునొ మాఁకొ యయ్యరే.

మీన—(చెవులు మూసికొని) రామరామ. మేమంత క్రూరచిత్తులమే. నీవుచావనేల

చ. ధనమునుగొంచుఁ దస్కరులు దారుణకృత్యము నిట్లు చేసిరో

సారం—శివశివా ! అటుల జరుగలేదు.

మీన—కనికరమన్నమాట విడిజ్ఞాతులు పాతక మిట్లొనర్చిరో

సారం—అటులేల జరుగును.

మీన—వనితలు మచ్చరంబున నెవండయిన న్నినునిట్లు జేసెనో

సారం—అట్లును జరుగలేదు.

మీన — యౌవనమునఁ దప్పుజేసినవానిని యేయొక్కరాజెట్లు శిక్ష చేసెనో.

సారం — త్రికాలజ్ఞులగు మీకు తెలియనిదేది?

మీన — కుమారా! రాజట్లు శిక్షింపుటకుఁ దగినతప్పేమి చేసితివి?

సారం — (సిగ్గుపడును.)

మీన — ఏమీ పలుకకున్నావు? చేసినతప్పును జెప్పుటకు తప్పుగా దోఁచెనా?

సారం — తప్పేమి? నాలుక రాకున్నది. నిజమని చెప్పుదును. అడుగఁదలఁచి యడుగుచున్నాను. కాని మీకుఁ దెలియనిదేమియున్నది?

మీన — సరే. యోగదృష్టిం జూచెద (యోచించి)

చ. తెలిసెను దేటతెల్లముగఁ దెల్పెద నక్కట లేదు పిన్నయుం
చలమునఁ బోవ నావె నినునక్కట కోరెను గాదె కోరికన్
ఫలమును జెందమిన్ నృపుని భర్తకుఁ జెప్పెనుగాదె దానిచే
గలిగెనుగాదె యీసిలుగు కానఁ జేసిన కర్మసంగతిన్.

సారం — మునివర్యా! తొంటికర్మము చేసెనని నుడివితిరి ఆకర్మం బేదియో తెలిసికొనుటకుఁ బాత్రుం జేసి యానతీఁడు

మీన — వత్సా! నీయందలి వాత్సల్యముచేఁ జెప్పెద వినుము. ఈభూమండలంబునకు మండనంబగు కౌశాంబియను పురంబు సకలసంపదాకరంబై యొప్పు. దానిని ధవళచంద్రుఁడను నరేంద్రుఁడు పరిపాలింపుచుండె. అతనికి భువనైకసుందరి యను భువనైకసుందరియను రాణియు, సుమంతుండు, జయజంతుండునను సచివులిరువురు గలరు. ఆసచివులలో సుమంతునియందు రాజు పక్షపాతము గలిగి యధికంబుగా గౌరవించుచుండెను. అందులకు జయంతామాత్యుం డసూయగలిగి సుమంతుని నెటులయిన వంచింపవలయునని భువనైకసుందర్యవరోధన భుజిష్య యగు కేశనిఁ జేరంజీరి కేశీ! సుమంతుని పాదుకలంగొని దేవిగారి యంతఃపురంబులో ఖట్వాంబు క్రిందఁ బెట్టిన నీకు వలయు వలువలు భూషణంబులు నిచ్చెదనని చెప్పెను. అంత నాయింతి స్వాంతంబున నత్యంతంబు సంతసించి ఇది యెంతపని నా చిటికెన వ్రేలి గోటిలోనున్నది యనిచెప్పి యాదినముననే యట్లొనరించెను. ఆనాఁటిరేయి రాజు దేవితో సుఖంబుననుండి ప్రభాతసమయంబునందు మంచంబు దిగి తన పాదుకలను దొడుగుకొనఁ బోయి సుమంతుని పాదుకలం గని శంకించి చానను మేలుకొలుప నామె దిగ్గున లేచెను. అంత రాజు, 'ఈపాదుకలు నావి కావు. పరపురుషునివి ఇక్కడకు వచ్చుటకు గతంబేమి' యని యడుగ నుల్లంబు జల్లుమనఁ దెల్లఁబోయి కన్నీరు మున్నీరుగాఁగ నేడ్చుచుఁ దుదకుఁ జెయ్యాడ చిత్రపటమువోలె నిల్వఁబడియె. తన చానవలన సంశయము తేటపడమి నారాజు కొలువునకేఁగి యందుండువారిని నీపాదుక లెవరివి? యని యడిగెను. అప్పు డచ్చట సభాసదులందఱు భయాక్రాంతస్వాంతులయి యొకరిమొగము మఱి

యొకరు చూచుకొన సాగిరి ఆసమయమునఁ గాలకేతుండను తలారి, ఈ పాదుకలు సుమంతాఖ్య సచివునివి ' యని స్పష్టముగఁ జెప్పెను. అంత సాధరణీకాంతుండు దండతాడిత భుజంగము భంగి మండిపడి యోరీ! సుమంతా! అంతఃపురద్రోహీ! నాప్రాణసమానంబని విశ్వసించిన నాకే యెగ్గుసేసితివా' యని ప్రళయకాల శుంభ దంభోధరంబో యన నట్టహాసము చేసెను. అడవిని సుమంతుండు చింతించి రాజానకిట్టి యపకీర్తి గాఁ జెల్లునే యని నిలువునకు నిలువున కరగి మూలచ్ఛేదిత కదళీతరువో యన బుడమిపైఁ జతికిలఁబడి యూరకుండెను. అట్లూరకుండుటచేఁ దప్పొనరించెనని దృఢంబుగ విశ్వసించి యంతఃపురద్రోహిని నడుకానలోఁ గాలుసేతులను ఖండింపవలయునని పెద్దలు సెప్పనట్లు సేయుఁడని తలారుల కాజ్ఞ నొసంగి భువనైకసుందరిని నూతిలోపలఁ ద్రోయించెను తరువాతఁ దలవరులు సుమంతుని కాలుసేతులు ఖండించిరి. అప్పుడట్లన్యాయముగాఁ జంపఁబడిన సుమంతుఁడే రాజరాజనరేంద్రుఁడు; కపటాలోచనచేసిన జయంతుఁడే నీవు, భువనైకసుందరియే చిత్రాంగి. పరాభ్యుదయం బోర్వలేక యన్యాయముచేఁ గపటోపాయమును బన్నితివి కావున నేమియు నెఱుంగక పోయినను నీజన్మంబునందీ యవస్థ తటస్థమయినది. ఎట్టివారి కయినను కర్మం బనుభవింపక తీరునా?

సారం—మహానుభావా! కర్మసూత్రము నెఱింగించి చింతాక్రాంతునిగ జేసితిరి. వందనములు గైకొనుఁడు ఇకను ప్రాణంబులు పోకున్నవి. నాకష్టంబు గెడఁబాప మీరుదక్క నన్యులు లేరు. శరణంబు జొచ్చితిని. నిర్వ్యాజకారుణ్యశ్రోత్రియులరుగదా!

మీన—నీగుణగణం బత్యంత ప్రశంసనీయంబు; ఏకాంతమందు మును నీవు వలచిన దానిని గూడక పోవుటయేగాక నీకడగండ్ల కెన్నిటికైన నోర్చి యామె కవమానము లేకుండఁ జేసితివి. ఇంతియేగాక యామె యిట్లు చేసెనని చిత్తమందైనఁ దలంపవైతివి. ఎచ్చట సుగుణంబులుండునో యచ్చట భగవంతుఁడుండును. కావున నీకు సర్వేశ్వరుండె దిక్కు లెమ్ము. లెమ్ము.

సారం—సంయమీంద్రుల యాజ్ఞ యెంతకుఁ జాలదు. మీయాజ్ఞయే నాకుఁ దయయుఁ గాక (లేచి) స్వామీ! వందనములు. మీవలన జీవితుండ నైతిఁ గాని యీయపకీర్తి యెక్కడ నెట్లుతొలఁగును.

మీన—ఇంక నపకీర్తి యెక్కడ? మన మిప్పుడు మీ జనకునియొద్ద కేగుదము. అచ్చటఁ గలవార్త యంతయుఁ జెప్పెదనమ్మ.

సారం—మాళవదేశంబునుండి జయసేన రాగిసేనులు వచ్చిరి వారెవరు?

మీన—చిత్రాంగి చెలికత్తెలు. పందెపు ధనమొసంగలేదను వగ నీకక్కఱలేదు రమ్ము.

సారం—చిత్తము. (అని యిద్దఱు నిష్క్రమింతురు.)

గద్య—ఇది శ్రీ అష్టావధాని విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వర ప్రణీత
సారంగధర నాటకమునందలి
షష్ఠాంకము.



# సారంగధరనాటకము.

## సప్తమాంకము.

చిత్రాంగి మందిరము.

(చిత్రాంగిపరుండ రాజరాజనరేంద్రుఁడు ప్రవేశించును.)

రాజ — అదియేమి కారణమో కాని దేవి యంతకంతకు గృశించుచున్నది. (యోజించి) వేఱొకటి కావలయునా? సారంగధరునిచే బలాత్కరింపఁ బడినది గదా! ఆయవమానానలంబే యీమె నిలువెల్ల దహించుచున్నది. (ఆకర్ణించి) ఏమో మాటలాడుచున్నది. ఆమాటలం జాటునుండి వినియెద.

చిత్రాం — సారంగధరా! నన్ను డాయవేమి? కేలొంటిగాఁ గానిపడుచుండఁ గావవేమి? నీవే నన్ను కరుణచేఁ గాంచకున్న నిఁక గతియేది?

రాజ — ఏమి సారంగధరునియందలి మోహంబుచేఁ గాఁబోలు నీమె యిట్లనుచున్నది. (యోజించి) కాదు కాదు సారంగధరుఁడన్న శివుండుగదా. ఆయినను బ్రార్థించెనేమో? యేదినిక్కమో యిక్కడనుండియే గ్రహించెదను.

చిత్రాం — సారంగధరా! నీవు నాకుఁ బ్రియుఁడవుగావా? నీసతి యీగతి వెతనొంద నుపేక్షించుట తగవా?

రాజ — శివుఁడేయైన బ్రియుండగు టెట్లు కావున శివుఁడు కాఁడు నా కుమారుఁడు సారంగధరుఁడే కావచ్చును. (కోపముతో) వానిపటంబు జూపిగదా నే నీమెను బరిణయంబును జేసికొంటిని. దానిచే నీబంధకి సారంగధరుని బ్రియునిఁగా వాకొనుచున్నది. ఎంతదుర్మార్గురాలు నే నిప్పుడ యీకరవాలంబున దీనిని ఖండఖండంబులుగా ఖండించి కులంబు నిర్దోషంబును జేసికొనకున్న నింక రాజరాజనరేంద్రుఁడనా? (ముందుకు నడచి యాలోచించి) త్వరపడనేల! దీని యభిప్రాయము వేఱుగా నుండెనేమో (ఆలోచించి) ఖండకేమి సారంగధరుండన్న చంద్రుండు కాఁడా? పరిత్రపరిపదర్శనికిఁ బంచపతులలోపల జంద్రుఁడాద్యుండు కావున నిదియిట్లుచెప్పి యుండవచ్చు కోపముతో ఖండింపలేదు. పుణ్యాత్మ. ముందు కథ యెట్లుండునో వినియెదను.

చిత్రాం—

ఉ. మిన్నును మన్నునుం గనక మేలిది కీడిది యంచు నెంచక
న్నన్నకరాంఘ్రుల న్నఱుకనంపితి గాఁ గలదంతయయ్యె నా
పున్నమ చందమామ సరిపోలిన నీనగుమోము గోముని
కెన్నఁడుచూడకున్న మదినెట్టులఁబాయును బాళిచీఁకటుల్.

రాజ—ఈగాలుసేతులు నఱుకఁబంపినది నాకుమారుని గాదుగదా! ఏల యీతొందర ? కొంచెము శాంతించిన దానియంతనదియే తెలియును.

చిత్రాం—

చ. మదనుని కేళిదేల్పని తమంబున నిందను మోపి కానని
పదములఁ జేతులన్ నఱుకఁబంపితి భూధవు చేతఁ బాఁగొనం
గదని పొదుంగు గోసినటు కాయును నీయది యున్న మారసౌ
ఖ్యదశలు లేకపోయినను గన్నులనైనను జూచుచుందుఁగా.

రాజ—ఔరా! దీనికి వానియందుఁగల యనురాగము వేఱె చెప్పవలయునా ? ఓపిగ్గిఁడి ఏమిచెప్పనుంటివో యొక్కటియయిన దిగఁబడకుండఁ జెప్పుము. ఓ రాజరాజ నరేంద్రా! కలికి కలవరింపుచున్నదేమో ? (తలయూఁచి) అటులైననింకనుశాంతి చేతను జూచెదను.

చిత్రాం—

ఉ. అంగజరూపయంచుఁ గనకాంగియు హా తనయాయటంచు ర
త్నాంగియు నేఁడు నీదు విలయంబునకుం గడు హేతువైన చి
త్రాంగిని నెంచుచుం బలిమిఁ బ్రాణము బాసితి నీవు నేను సా
రంగధరాయటంచు నిఁక బ్రాణముఁ బాసెద నిన్ను డాసెదన్.

పావురంబునకై నీవురాఁగా వావియయిన దలంపక నిన్నుఁ గోరినను వలదమ్మా యంచు నీవెంతయు వచించితివి. అదివినక నీపావురంబుల నీయొక పైఁజెఱఁగును లాగికొని నీయందలి కినుకచే లేనికల్లలు కొల్లలుగాఁ జెప్పి నీతండ్రిచేశిక్షింపఁ జేసితిని నిన్నుశిక్షింపఁగా నీతల్లికిఁ బుత్రదుఃఖమును నీసతికి వియోగదుఃఖంబు వచ్చెనుగాని నాకు మారసౌఖ్యం బలవడలేదు అటుల లేకపోవుటయేగాక నిజ మెఱింగిన సుబుద్ధి మొదలగువారు చిత్రాంగి యిట్టిదని చెప్పుకొనుట కవకాశము కలిగినది. పలువురిలోపలఁ దలవంపులయ్యె నెదియెటులయినను గోరిక కొనసాగ దయ్యె హా సారంగధరా! శిరీషకుసుమనవకోమలశరీరా! వనితాజనచిత్త విత్తచోరా! రాజరాజనరేంద్రగర్భపయోరత్నాకరా! సారంగధరా! హృదయకమ లాధిష్ఠిత సారంగధరా! సారంగధరా! నాకోరిక యీలోకమునందుఁ దీర్పకపోయి నను నాలోకమందైనను దీర్పుము.

రాజ—(కోపముతో)

ఉ. ఓసిదురాత్మురాల మది నోటరయుకింతయులేక పుత్త్రుపైఁ
బూసలు గ్రుచ్చినట్లనృతముల్ వచియించితి వీవు గాన నిన్
గోసెద ముక్కముక్కలుగఁ గూలఁగఁ ద్రోసెద నుప్పుపాతరన్
వానిగలట్టి యాత్మజుఁడె పోవుగ నీవిఁక నుద్ధరింతువే.

ఛీ! దుర్మార్గురాలా! నిన్ను ఖండఖండములుగా ఖండించి మార్తాండమండలంబున కెగమీటకున్న నేను భూమండలాఖండలుండనే?

చిత్రాం—(తనలో) నేను చెప్పినదంతయు నీయన పొంచివిన్నాఁడు కాఁబోలు? నేనేమిచేయుదును? (ప్ర) నాథా! శత్రువు లెవ్వరైన నిచ్చట నుండిరని వచ్చితిరా? లేక కలవరించుచుంటిరా?

రాజ—పాపాత్మురాలా! కలవరించుచుంటినా! ఎక్కడనేర్చితి వీటక్కు మాటలు.

చిత్రాం—అరత్నాంగి నాయందేదేని దోషారోపణంబును జేసి మీతోఁ జెప్పెనా యేమి?

రాజ—రత్నాంగిమాటలెందుకు? నేను నీ మాటలు స్పష్టముగ వినలేదా!

చిత్రాం—మీకు మతితప్పిపోయినట్లున్నది. కుమారుఁడు పోయినాఁడను చింతచేతఁ గాఁబోలు చిత్తచలనంబు కలిగి కనుపడ్డ వారినెల్లఁ జంపఁదలఁచితిరి. చంపుఁడు పతికిఁ బతిచేతిలోఁ జచ్చుటకన్నఁ గైవల్యంబును జూఱగొనుటకు వేఱొండుమార్గమున్నదా!

రాజ—నీ కులటా! కుమారప్రాణాపహారిణీ! నాకు మతిపోవుటఁ బట్టియే నీమాటనమ్మి చెట్టంతకుమారునిఁ జేతులారఁ జంపుకొంటిని. తప్పును జేయుటయేగాక దానిఁ గప్పిపుచ్చుటకు నాయందేదో వెతకుచుంటివా! నీబొంకులింతకుమున్ను గుమారుని గోల్పోవుట కుపయోగించెను గాని యింక నక్కఱకువచ్చునా.

చ. పరమపతివ్రతా మణివి భామలకున్ దలకట్టవంచు నిన్
బరిణయమైన దాదిగను భార్యలలోపల గౌరవంబుగా
విరులను బెట్టి కన్నుగవ విందుగఁ జూచుచు నుంటిగాని యి
ట్లరయఁగ మేఁకవన్నె పులి వంచొకనాఁడు నెఱుంగనైతిగా.

చిత్రాం—ఓదైవమా! నానాథుండు మున్నెన్నఁడెఱుంగని మాటల ననుచున్నాఁడు. మనము చక్కగానున్న నెంతో ప్రేమగల నన్నిట్లాడునా! ఇక్కడ నాకెవ్వరుదిక్కు! ఎప్పుడు నాతలిదండ్రు లీపురుషుని చేతికి నప్పగించిరో యప్పుడే యీశరీర మీయనదేగదా కొట్టినను కోసినను జంపినను మఱియేమి జేసినను సరే. జన్మజన్మములకీ రాజరాజనరేంద్రుఁడే భర్తయగునట్లుగాఁ బ్రసాదింపుము.

రాజ—ఏల యీలీల రిత్తయేడ్పు లేడ్చెదవు ?

గీ. హరిణశాబకమును భూరికరుణఁ బెంచి । పిదప బెబ్బులివాతకుఁ బెట్టినట్లు
ముక్కుపచ్చలారని నాదు ముద్దుకుఱ్ఱఁ గట్ట! చిత్రాంగి నీపాటఁ బెట్టినాఁడ.

ఓసీ దుర్మార్గురాలా! నీవింతకు ముందాడిన మాటలఁ దేట తెల్లంబుగఁ జెప్పుము.

చిత్రాం—నా కేమిమాటలున్నవి ? మీరెప్పుడువత్తురా మీపాదసేవనభాగ్యం బెప్పుడుకలుగునా యని యదేపనిగా నెదురుచూచుచుంటినిగాని వేఱేమియులేదు. మీరే దైవంబని త్రికరణశుద్ధిగా నమ్మిననన్ను మీరే యిట్లాడినఁ బరులనుగూర్చి యింకేమి చెప్పవలయును ? మీపాదసేవఋణము నాకుదీఱినది కాఁబోలు ? మీకుఁ దెలియని దేమియున్నది ? అక్కడఁబుట్టినాను. ఇక్కడ మెట్టినాను ఇఁక నేపాపం బెఱుఁగను ఇందులకు మీపాదాలుసాక్షి. ఏబాసను జేయుమన్నఁ జేసెదను. మీఁద మీయిష్టము,

రాజ—

మ. గతులన్ జూపెడువానిఁ గందుకములోఁ గాలాహివై చావఁ జూ
చితి నీసీ నినుఁగన్న దుష్కృతము కాశీయాత్రకుం బోయినన్
స్మృతిచంద్రాయణ మాచరించినను సేతుస్నానమున్ జేసినన్
మతి నూహింప నశింప దెప్పటికి భామాగోముఖ వ్యాఘ్రమా.
ఛీ, నీమొగమును జూడరాదు. పొమ్ము.

చిత్రాం—మీకింతకోపముగా నున్నప్పుడు మీచెంత నుండనేల ? శాంతించిన పిమ్మట వచ్చెదను గాక. (నిష్క్రమించును.)

రాజ—ఓదైవమా !

గీ. అనిలభక్షణమున దక్షి యచలమైన । తపముఁ జేసి పరబ్రహ్మ దయను బడయ
వీలుగాని యేక్రియనైన వీసమంత । యేని నెఱుఁగ శక్యంబు కాదింతిమనము.

ఈదుష్టురాలి మాటవిని నాకుమారుని నిష్కారణంబుగాఁ జంపుకొంటిని.

శా. పూజ్యుండౌ సుతుమీదఁ దప్పునలుకన్ బూఁబోడి నేనగ్గిలో
నాజ్యంబుంచిన రీతినుండియు సభన్యాయంబు వీక్షించినం
బూజ్యంబయ్యెను సత్యమీఖలునకున్ భూమిన్ గతుల్ గల్గునే
రాజ్యాంతే నరకం ధ్రువంబనుట తార్కాణంబుగాఁ దోఁచెడిన్.

తనయా ! నిన్ను నిష్కారణంబుగాఁ జంపఁబంపినప్పుడు నన్నెట్లనుకొంటివో ? యేమనుకొందువు ? అట్లు బలవంతముఁ జేసి యన్యాయంబుగా నిమీఁద నింద మోపిన దుర్మార్గురాలినే పల్లెత్తి పలుకనట్టి నీవు నన్ననుకొందువా ? ఊరకు

న్నప్పుడు తప్పుచేసితివని నిశ్చయించితినిగాని లజ్జాభరంబున శిరంబును వంచు కొంటివని యెఱుంగనైతి, తండ్రీ ! సారంగధరా ! నేను రాజభార పీడితుండన యినప్పుడు—

మ. చతురంభోధి పరీతభూకటక రాజన్యాళి శాసించి శా
శ్వతకీర్తిన్ గణియింతు వంచు నకటా ! సంతోషమెంతెంతొ చెం
దితి డెందమ్మునఁ గాని యోయితనయా ! దిక్కొందులేకొంటిగా
మృతి నీవొందుదు వంచుఁ గ్రూరవనిలో నే నెన్నమున్నెన్నఁడున్.

బిడ్డా ! నాయట్టి యభాగ్యునికేల జన్మించితివి ?

మ. సకలోర్వీధనచంద్రవంశ మకుటాంచన్నూత్నరత్నప్రభా
ప్రకరాశాంతవిరాజితాంఘ్రునరగర్భంబందు జన్మించితీ
వకటా ! యీదృశమైన కష్టముల నన్యాయంబుగా నొంద నిం
దకుఁ గాఁబోలును బేదవానికయినన్ జన్మింపవై తేమిరా.

కుమారా ! నిన్ను మఱతమన్నను—

గీ. చంద్రికలఁబోలు మందహాసంబుచేత । ముద్దులనుమాటగట్టు నీమోమునసుధ
వ్యాప్తమగు నీప్రతాపమేభంగిమఱపు । వచ్చుఁజండార్కులిద్దఱు వలుదాఁక

శా. ఏఁడీ మీసుతుఁడంచు నన్నడుగ నీయిష్టాళి యెవ్వారలో
నాడంబోయితి వంచుఁ దెల్పుదును గుమారి యత్తవారింటికిన్
జూడ న్బోయితి వంచు నెట్టులనెదన్ శూలాయుధంబట్టులన్
ఛేఁదంచాత్మజుఁ డంచు నెట్లనుటకున్ లేశంబునోరాదదే.

హాదైవమా ! ఇంక నేను రత్నాంగిమోము నెట్లుజూతును ? చూడకున్నఁ తప్పునా ? సేవకా ! రత్నాంగిదేవిని నాకోడలిని సుబుద్ధిని బిలిచికొనిరమ్ము.

సేవ—(ప్రవేశించి) చిత్తము. (నిష్క్రమించి వారితో మరలఁ బ్రవేశించి)
అయ్యా ! యిదె వచ్చినారు.

రత్నాం—హానాథా ! ఎంతకష్ట మెంతకష్టము.

రాజ—రత్నాంగీ !

క. విభవాన్వితమద్వంశ । ప్రభువులలో లెక్కకెక్క ప్రభువైనను నో
కభగయుతుండు నభూతో । నభవిష్యతి నుత్సవోన్ను కాంజను నాఁటి.

గీ. వయసువానిన రాగంబు పాయకుండ । ఘనపదంబులఁ జొట్టెనె తనయరూప
లతయొయ్యాలత నే సమూలంబుఁ గాఁగ కుటిలచిత్రాంగిభాగంబు గొట్టెకనకట.

రత్నాం—అన్యాయముగా నెంతయాపద దాపరించినది.

గీ. అక్కటా పూర్వజన్మమునందు నేను । బక్కలోనుండు నెవ్వరిబాలుఁ దల్లి
పాలకడఁ బాసితినొ యది ప్రాప్తమయ్యెఁ । గాకయున్న యేరికిని బురాకృతంబు.

రాజ—

మ. వనితా యీకులనాశ కారణుఁడు పాపాత్ముండు దుష్టుండు నీ
తనయున్ సద్గుణుఁ జంపఁ బంపెనని చింతన్వేఁడె నీకగ్గుఁ జే
సిన వాఁడంచుఁ దలంపఁబోకు సవతిం జిత్రాంగి నేనాఁడు తె
చ్చెనొ యానాఁడె తదీయకంఠమును గోసెంజుమ్మ దుష్కర్ముఁడై.

కాంతా! యెట్టిఘోరకృత్యంబును జేసితిని.

చ. చొటచొటరాలు నశ్రువులు క్షోణిఁ దరంగిణిభంగిఁ బాఱఁగాఁ
దటదటమాటలన్ దరుణి ధర్మమువీడి వచింప నమ్మి నేఁ
బటుతటపడ్లుగీటుకొని పాపవిదూరునిఁ జంపఁబంపితిన్
గటకట కండ్లకుంజెవులె కన్నులటన్న పదమ్ము రిత్తయే.

ఈరాజరాజనరేంద్రరూప ఘాతకుండైన నేను,

ఉ. ఉప్పనుచూచి కప్పురము నోలిఁ ద్యజించినభంగి భామ నీ
యొప్పగనమ్మి కూర్మితనయుం దెగటార్చఁగఁ గానకంపితిన్
జొప్పడదన్న నీ హితము సుందరి నేవినియున్నఁ గాంతునా
దెప్పర మేలవిందు వడిదీవిసఁగా పెదభార్య దిక్కగున్.

సుబుద్ధీ! నీ వెచ్చెలితో నడవికి నేగుటకై సూచుకొంటివి. తండ్రినైన నేను దానికి గూడ నోచనైతినిగదా!

సుబు—అడవికిఁ బోవుటచేతనే నాకు మతింత చింతగానున్నది. ఏలయన,

చ. నడిచెడువాని చందమున నాల్గడుగుల్ వడి ముందువోయి లే
యడుగులు గందువార వదనాంబుజమాంబు సమర్పఁ దద్దయు
న్నదలి తలారులార విపినంబిక నిక్కడ కెంతదూర మం
చడిగెడు నంగడీనినుడి యాలినిమంటను బెట్టె భూవరా.

చ. అడిగిన సొనికండలను నప్పటి కప్పుడ కోసియిచ్చు విం
త్రుఁడయుని చీర నాజనని తోయజనేత్ర నమీయటంచెటొ
తడబడఁ బల్కి యశ్రువులు ధారలుగాఁబయి మాటలేక నే
రదలున నేమ్ముదిష్టు బహుళార్తిఁ దహించుచు నుండె నెంతయున్.

పేరుపేరువరుస నందతి నడిగినాఁడు.

రాజ—హా! కుమారా! సారంగధరా! కలుషవిదూరా! యీకడుపుమంట నెట్లు చల్లార్చుకొందునోయి.

చ. తనయుఁడు లేఁడటంచు నెలఁదాల్పును గూర్చి తపంబొనర్చి యీ
యనకృపచేత నిన్బడసి యన్వయ మభ్యుదయంబునొందు నిం
కనుచు మనంబునం దహరహంబును రంజిలుచుండఁ జిన్నినా
యన! యిటులింతలోన నిశతాబ్దములక్కట నీకునిండెనే.

రత్నాం—హాతనయా

మ. కరకంజంబులు మోడ్చి మ్రొక్కఁగను మార్కండేయు నుండ్కన్నిరం
తరమున్ వర్ధిలుమంచుఁ బల్కెనని వాతప్పద్ది లేకప్పుడే
త్వరగాఁ జావుమటంచుఁ దిట్టినను నోహిందీ! శతబ్దంబు లీ
స్థిరజీవింతువు తిట్టుతిన్న జనులే జీవింతు రెక్కాలమున్.

కన—హా! జీవితేశ్వరా!

గీ. వెదకుదమటన్న దోషంబు వీసమైన। నరయకట్టి నీవెతఁ జెవులార వినియు
వ్రక్కనను గుండె బ్రద్దలుగాకయుండె। శిలయొ వజ్రమొ లోహమొ తలఁప నేది.

సుబు—హామిత్రమా! అఖిలారణ్యంబులో,

మ. కరపాదంబులుపట్టి ఘాతకులునిన్ ఖండించువావేళ నే
కరణిన్ భీతిలితో విచారపడితో కాపాడరండంచు ని
న్వరినే కైవడిఁజీరితో

రాజ— జనకునిన్ బాపాత్ము నేమంటివో

రత్నాం—యరవిందాసను వ్రాఁతనెంచుకొను చస్మోత్రయంచు నెట్లేడ్చితో.

చ. అరసిన రావిచెట్టులకు నన్నిఁటికంబువులిచ్చి గుళ్ళగో
పురముల చుట్టునందిరిగి పుట్టలకెంతయుఁ బాలువోసి శ్రీ
కరులిడినట్టి తాయెతుల గట్టుచునోదలఁ బుచ్ఛనేసి యీ
శ్వర సుతుఁగాంచుటల్ సవతి సత్త్రిక్రమింగుట కప్పగించదే.

కన—

చ. అనుపమరూప సద్గుణము లన్నియు నాపతిలుంద చూచు నీ
వొనరిచినంత నేమిఫల ముర్విని నాలుగునాళ్లు హాయిగా
మనుపఁగలేకపోతివి రమాతనయా సురసేవఁజొక్కు నీ
కనువగుమార్గముల్ తెలియునా నిను వేయి పుటాలు పెట్టినన్.

రాజ—హా కుమారా! సారంగధరా!

గీ. ఆత్మజానంద మొనరించి యంతలోన । విడిచి యాత్మజదుఃఖంబు పెట్టినావె
వచ్చి మోదంబు కలిగించి పాసిపోయి । తానె ఖేదంబు కలిగించు ద్రవ్యమట్లు.

రత్నాం—హా దైవమా!

గీ. కొడుకు కర్ణధారుఁడు గాఁగఁ గొడుకు హితుఁడు । కరము తెరచాప కాఁగ జుక్కాని గాఁగ
దకరఁగోడలు నాహర్షతరణి సుఖము । వార్ధి ముంచెఁ జిత్రాంగి తుఫానుగాలి.

రాజ—చిత్రాంగి దుష్టురాలని నలువురినోటిలోఁ బడెనుగాని నాకుమారుఁడా చిత్రాంగి మాయలచేఁ జావఁడని నాయభిప్రాయము. వాఁడు ధర్మమార్గప్రవర్తకుఁడు గదా! అట్టివాని నేమహాత్ముఁడైనను గాపాడక మానఁడు. నేను బిలిచెదను. వాఁడేల రాకుండును? తండ్రీ! సారంగధరా!

సీ. భూపాలసుతులు నీపాడెఁ గానవచ్చిరి చూడరాకున్న నాతోడు సుమ్ము
కల్యాణి మీయమ్మఁ గనిపల్కరింపక యుండిన నామీఁద నొట్టు సుమ్ము
కీరవాణిని నీదు వారనింగనకున్నఁ బట్టినామంట గన్నట్టు సుమ్ము
మలయమారుతమట్లు మాదిక్కునకుఁ జేర నటులైన నను జంపినట్లు సుమ్ము
గీ. కన్నడ సలిపి మమ్ములం గానకున్న । నయ్య గురుపాదములు దప్పినట్టు సుమ్ము
తోడివారలదుఃఖంబు వీడఁజేయ । వేనిఁ దండ్రీ మీయమ్మపై నాన సుమ్ము.

సీ. సుకుమారమముఁ జేర నిఁక రారయని చీర ననుకంప జనియింప నరయవేమి
సరిబూటకపుమాట మతినాటవిధిదాఁట కిటుచేయుకుపబాయ నెంచవేమి
నినుఁ బాసి సిరిలోని నెలిగావిగనడాసి వగదీర మనసారఁ బలుకవేమి
ధృతిమాలి వెతసోలి గతిమాలి క్షితిగూలితిమి గావఁగను లేవఁదీయవేమి
గీ. అఖిలగుణవార సూరిచిత్తాబ్జమార । దర్పకాకారవిజితోగ్ర దస్యువీర
జలధిగంభీర కనకాద్రిసదృశధీర । రార నాకుమార కుమార రారరార.

ఉ. ఎన్నఁగరాని తప్పిదము లీవొనరించితి వేనవేలుగా
నన్నను జూడరాదనుచు నాదరిఁ జేరక యున్నమానెము
న్నెన్నఁడు పల్లునెత్తి పలుకింతయు వాడని యమ్మఁ జేరి యీ
యన్నను గోరకుంటఁగను మాత్మజచిత్తము వచ్చినప్పుడే.

ఎన్నోవిధంబుల నెంత బతిమాలినను రాకుంటివి నీకపకారముఁ జేసినవాఁడ నగుటచేతనా? అటులయిన వినుము,

ఉ. ఇకయు నిశ్చయంబతిచి నీరజనేత్రను గృష్ణవేణి నేఁ
జేకొనినట్టితప్పు పతిసెప్పినవాక్యము నమ్మి నీయెడ౯

గాకనుబోని నిన్ను నఱుకంగను బంపిన తప్పుదెప్పఁగా
నీకిది కాలమా తనయ నీరును గంటను బెట్టు పట్టునన్.

చ. ఘనతరమాలనుండి దిగి కాన్యపి పైఁబడు మాత్రిరాల భం
గిని నయనంబు బిందువులు ఖేదమునోడను దల్చుతల్లి భా
గ్యను నొకకంటఁ గాంచి హృదయాబ్జమున దయనిల్పి లేని నీ
జనకుని మీఁది యాగ్రహము జప్తికిఁ దెత్తువె రాకయుండువే.

హా కుమారా సారంగధరా! సద్గుణాలవాలా!

చ. సుతుఁ డెడఁబాసి పోయెనని శోకమునొందెడు తల్లినిన్నును
బతి యెడబాసిపోయెనని వాయని వేదనఁ గుంది కోమలిన్
హితుఁ డెడఁబాసిపోయెనని యెంతయుఁ జింతిలుచున్న మిత్రునే
గతిఁగని యూరడించెదవొ క్రమ్మతి

సుబు— యంతకు నోఁచినారమే.

రాజచంద్రమా పుత్రవియోగదుఃఖ సన్నిపాతజ్వరంబులఁ దల్లడిల్లుచు నేదియో పలుకుచుంటివి కాని యింకను నీకుమారుఁ డెక్కడ.

రాజ— నాకుమారుఁడే లేఁడా. వాఁడీలోకంబున లేకపోయినను బరలోకంబునందయినను లేకపోయెనా? ప్రాణంబులను బాపికొని యచ్చటనే కలిసికొనియెద.

ఆ. మారచారురూప సారంగధరకుఱ్ఱ! బ్రతికియున్న నీవె రాఁగదయ్య
మృతినిగన్నఁదానె తృటిలోన నన్ జేరఁ। దలఁచు భ్రష్టుఁడైన తండ్రికడకు.
మొదటిది ఘటింపదేని రెండవదిమాత్ర మెటుల ఘటించును.

మ. ననునీవిప్పుడు డాయకుండినను నిన్ డాయంగ వేవచ్చి యా
కనులం జూచెదనన్న నెట్లుపొసఁగున్ గాంక్షించి పైఁబడ్డ యా
కనకాంగిన్ గనకట్టి పుణ్యమున నాకంబందు నీవుఁ డని
న్ననఘుం జంపిన కిల్బిషాననిరయంబందెప్పుడే నుండుటన్.

రత్నాం— హా తండ్రీ! సారంగధరా!

చ. గణకులువచ్చి నీజననకాలము గన్గొని వంశమందు స
న్మణివలెఁ బుట్టె నీశిశువు ధాత్రిఁ జిరాయురుపేతుఁడై లస
ద్గుణములఁ బొల్చునంచనిరి

కన— కూటికి గుడ్డకుఁ గావె వారి భాషణములు

సుబు— సత్యమా నె గ్రహచారము చాలనివేళ

రాజ— అక్కటా!

రత్నాం—హా! దైవమా! కారుచిచ్చువలె నిలువెల్లఁ గాల్చు నీపుత్త్రదుఃఖంబునకా సంతానమిచ్చితివి?

చ. పరకృపబిడ్డనిచ్చినను బంగరుగద్దియ నిల్పఁబెట్టి యీ
శ్వర యదినాకుఁ జెల్లదని చయ్యనఁ గ్రిందకుఁ ద్రోసినావె యు
ర్వరపయి మర్త్యులెరయునఁ బాఁతిన మొక్కను జేతులారఁ ద్రుం
తురె సుతు నీయకుండినను దొల్తనదొక్కటె యేడుపౌఁ గదా

రాజ—ఓవిధీ! ఏదుఃఖమునయిన సహింపవచ్చును గాని యీపుత్త్రదుఃఖము సహింపఁ జాల కావున నన్నుఁజంపి పుణ్యంబును గట్టుకొమ్ము. యేమి యింకను జంపకుంటివి?

ఉ. మానినిమాటనమ్మి సుకుమారుఁగుమారుని వీడినట్టి యీ
హీనుని గోసియా మెనవకీకరణిఁ బ్రతికింపుచుంటి రా
కూనను ముందుకాఁదగిన కొమ్మను మ్రింగినయట్టినీకు నెం
దేనియు రోఁతచేఁత గలదే తలకొట్టులమారివే గదా

కుమారునిఁ జంపకున్న వీని కేమృత్యువు లేకయున్నది.

ఉ. చల్లని నీడనిచ్చెడు కుజంబును గూకటివేరు తోడుతన్
బెల్లునఁ బెల్లగించి పృథివీస్థలి మోఁదు గదల్పలేని పెం
డల్లరమైన గాలిగతి ధర్మపరు న్సుతు మ్రింగి యాశకున్
ఘల్లున మ్రింగ లేనయితి పేరిఁకఁ బెద్దగ నీల మృత్యువా.

హా! తండ్రీ! సారంగధరా!

క. సుకృతీ గతాయువనునుడి సుకుమారుఁడ నీయెడలనె చూపట్టెఁగదా
యిఁకనాయెడఁ జూపట్టెనె! యకటా! పాపీచిరాయువనునూక్తియిటుల్.

సుబు—ఈచంద్రకులంబున కెట్టివిపత్తుమూడినది. ఈవంతకంతకు నధర్మముగదా బీజము. ఓ సుబుద్ధీ! హితుని నక్రమముగాఁ గోల్పోవుటయే గాక యధర్మ ప్రధానమయిన యీదేశంబున నెట్లుందువు? ఎటులయిన మరణించి నీమిత్రునిం గలిసికొనుము.

మ. హితుఁడన్యాయము కాఁగఁ జచ్చెఁదనయా రాజెందెగిలెంచన్మ్రయుం
బిలయున్బెద్దగ నేద్వసాగిరి త్రిపన్ బేరత్త గాలేక యీ

పతిలోకాలోకములఁ బొక్కుచుండె సమసెన్ సత్యంబికేమంచు నీ
క్షితిపైనుండవలెన్ సుబుద్ధియును నిన్నీ చంపుమో ఖడ్గమా.

(నఱుకుకొనఁబోవును.)

రాజ—(ఖడ్గమును బట్టుకొని)

మ. హితముల్ బల్కిన యానుబుద్ధిపయికి వేగంగన్యాయముం బెసం
స్తుతచారిత్రు సుపుత్రు విప్ర పవిత్రుం జంప శాసించె నే
నుతజీవాబ్జమదేభుఁడా చెనటి యస్తోకప్రభుండాత్మనీ
కృత విద్యాంసవచస్సుఁ డాతు లవనీడే చంపుమా ఖడ్గమా.

(నఱుకుకొనఁబోవును.)

రత్నాం—(ఖడ్గమును బుచ్చుకొని) నాథా! మీరు మరణించి పుత్రదుఃఖంబునకుఁ దోడుగా బతివియోగదుఃఖంబు మఱియొకటి తెచ్చి పెట్టెదరా? త్వరపడక నిలువుఁడు.

రాజ—ఓ కాంతామణీ!

చ. వలవలఁగట్టువేళ నవభక్ష్యములుం దినుపట్ల భూషణం
బులఁగయిసేయు కాలముల ముందుగనెవ్వని నెమ్మిఁగాంతునో
తలఁపఁగనట్టియాత్మజుఁడె తాదివికిన్జన ముందు కాలఁగా
నిలిచిన మోడుమాడ్కి నెటునిల్వఁగ నోపుదు నక్కటక్కటా!

కవ—హా! దైవమా! ఈదుర్భరచింతాసాగరంబునకు దరియేదో కదా!

ఆ. ఎన్నియేండ్లు మనిన నీదేహ మడుగులే। ధ్రువము చావు సృష్టితోడనుంటఁ
గాని మంచిచెడ్డ గాంచి చచ్చుటయేమి। గాంచకేల్గుటొకటి గాదు దగదు.

అందు నధర్మమృత్యువత్యంత సంతాపాస్పదంబు.

చ. కుసుమములఁ దావిచందమునఁ జోఁడగ నువ్వుల దైలమట్టు విధ
ముల హిరణ్యరేత సురిమాడ్కినిఁ గాంస్యపు ఘంటనుందు నా
దముగతి సర్వమందు గలదైనను పాపము మండిపోవు నీ
సమయమునన్ బయల్పడుచుఁ జయ్యన మమ్ములఁ బ్రేమగాంచుమా.

గీ. ఎపుడు సాధు దైవము గాఁగ నెంతునేని। వేదశాస్త్రంబులు నిజమై వెలసె నేని
ధర్మమూర్తియై దైవంబు దనరు నేనిఁ। బతినిరీక్షించు భాగ్యంబు వచ్చుగాత.

మీన—(సారంగధరునితోఁ బ్రవేశించి) దీర్ఘసుమంగలివి గమ్ము పరమపతివ్రతా శిరోమణివైన నీకలభ్యంబెయ్యది?

రాజ. మాయాతిథిఁ బాలించి కరుణచే సేవించిన మహాత్మా వందనంబులు.

(అందరు నమస్కరించుచున్నారు.)

మాన— అందఱికి శుభంబగుఁగాత.

సీ. పరకాంతలను మాతృభావమూనెడివాఁడు కలనైన బొంకఁబల్కనివాఁడు
కీడుచేసిన వారికీడుఁ జేయనివాఁడు ప్రజలందు సమబుద్ధిఁ బరగువాఁడు
పరులబాధలఁ గాంచి పరితపించెడువాఁడు తనప్రేమ చూపించుకొననివాఁడు
పదిమంది యోగ్యాన్న పనులు సల్పెడువాడు వృజినంబునకెపుడు వెఱచువాఁడు

గీ. అట్టిసారంగధరుఁడు మీ కాత్మజుండు, నీకుబంటి నీకుమిత్రుండు నెమ్మిమీఱఁ
గాంచుఁడీ మీరు రత్నాంగి శ్యామలాంబ. యోసుమంగలీకన్యకాంగిరయా సుబుద్ధి!

రాజ— ఏమిా మా భాగ్యము. మేముచేసినదే పుణ్యము. మీవలె మఱియొక్క రెవ్వరు చేయరు.

గీ. కొడుకుమడిసెనటంచు మేముడిసియుండ, వానిజూపించి బ్రతికింపవచ్చినారు
గగనమంటెడుమంటలఁ గాలుచున్న, భవనమార్పఁగడవవానవచ్చినట్లు.

సారం— జననీజనకులారా! నమస్కారములు. మిత్రమా! కుశలమా? ప్రియురాలా! శుభంబా?

రాజ—

ఆ. రారముద్దులయ్య రారచక్కనిచుక్క, రారచిట్టిపాప రారకుఱ్ఱ

రత్నాం—

రారచందమామ రారనవ్వులయిక్క, రారకన్నతండ్రి రారబిడ్డ.

(దగ్గఱకుఁ దీయుచున్నారు.)

కన—

గీ. సిరులుగలవారలొక్కింత కాలుఁద్రొగ్గ, నందరేమనుచు వత్తురడ్డపడఁడొ
కండు దైవోపహతులకుఁ గాళ్ళుతన్ను, కొనుచువారిఁగో వారలేకుండవలయు.

అటులుండ నీమహాసంయమీంద్రుఁడు కేవల కరుణారసవృష్టిని మిమ్ముఁబ్రోచె ఈయనకు నమఃపదంబుదక్క మనము తిరిగిచేయునది లేదు.

సుబు— మిత్రమా! (కౌగలించుకొని)

చ. కనులకు నాల్గునాళ్ళు చెలిగన్పడకొక్కెడ గానుపింపఁ
చ్చిన తమపెద్దలందఱును జేరినయట్టుల సంతసింతురిం

కనుమనకెందు లేఁడనెచుఁ గాయముఁబాయఁగ నున్నవేళ మి
త్రునిఁ గనువారికిన్మదిని దోఁచెఁడు సమ్మదమింత యంతయే.

సారం—తండ్రీ! పిన్నమ్మగారెక్కడ? పిల్పింపుడు.

రాజ—సేవకా పిలుచుకొనిరమ్ము.

సేవ—చిత్తము దేవా! (నిష్క్రమించి మరల చిత్రాంగితోఁ బ్రవేశించి) ఇదే వచ్చినారు.

చిత్రాం—(తనలో)

ఆ. కలిమిరూపవయసుగన్నను గనకున్న. ధవుఁడె దైవమంచు దలఁపవలయుఁ
గాక వారివీరి గలియఁగోరుటకన్న, బండతోడ గోఁతఁబడుటమేలు.

ఉ. ఎట్టుల సాధుశీలుఁడను నెట్టులఁ బుత్రుఁ బవిత్రుఁగాఁగు నిం
కెట్టుల సిగ్గులేక తలయెత్తుచు నేమనిపల్కరింతు మా
కెట్టులఁ జెల్లులోన నొకయింతయు నెత్తురుజీముగన్న ను
న్నట్టులె ప్రాణమేడ వలదావిషమే నిలువెల్ల నిండెనా.

ఉ. మాతృసమాననయ్యు నభిమానము వీడి కుమారుఁగోరి శ్రీ
జాతికి నెల్ల భాస్కరుఁడుఁ జంద్రుఁడు దారలునుండుదాక నే
నీతలవంపుఁ దెచ్చితి నినీమని యుండుటకన్న గట్టిగాఁ
జేతులు ముక్కు మూసికొని చెచ్చుటఁ జచ్చుటె దొడ్డకార్యమా.

సీ! ఆత్మహత్యమాత్రము యుక్తమయిన కార్యమా ఒకవేళఁ దెలిసియో తెలియకో తప్పునుజేసినను బశ్చాత్తాపంబునొంది యెవరికి గీడునొనరించితినో వారిని మన్నింపుడని కోరుట యుక్తము. కావున మన్నింపుమని సారంగధరునే వేఁడెదనుగాక. (ప్రకాశముగా) తండ్రీ సారంగధరా!

ఉ. నన్నుఁ గుమారుఁ గోరఁదగు నా జననీ యిది తప్పు తప్పటం
చెన్నివిధంబులో హితము నీవువచింప గ్రహింపకుంట గా
కిన్నరనాథుతో వ్యామలెంతయుఁ జెప్పి వధింపఁగంటినే
నెన్నఁగ దుష్టురాల మారయింపఁగఁ బాపిత మొందుగల్గునే.

రాజ—ఇంతీ! ఇఁదు నీ తప్పేమున్నది.

చ. ఎవనిని భర్తగా బడయ నీప్సితమున్నదియొ వానినే
దవులఁగ నీవుగోరితివి దండ్యవు కావు పరస్పరానురా

గవళుల మిన్ను వ్రేలుపడగా నొనరించెను మధ్యశేరియే
స్థవిరుఁడై వాఁడె వీఁడగుట దండ్యుఁడు దండ్యుఁడు మూత్రిశుద్ధిగన్.

నన్న—(ప్రవేశించి) నీవుమాత్ర మెట్లు దండ్యుండవు. అసమానవివాహం బీ రూపంబుగాఁ బరిణమించెను.

ఆ. ఎన్నియున్న లాభ మేమి కాంతకునీడు। గన్నవాఁడు భర్త గాకయున్నఁ
గోటిమాటలేల కూఁకటుల్ గొల్చియే। పెండ్లిసేయవలయు వేఱువలెను.

వేఱుగఁ జేసిన నాలోపకెన్నిరొండఁ బాటులున్నవి.

ఆ. పట్టువగలె కనులుగట్టిగా మూయంగ। నాలుగాదు నల్లతేలుగాని
యాంచు ఖేదపడుటకన్న నంతకు। దగిన బొంతఁ దొడుగఁ దప్పలేదు.

రాజ—పుత్రవతియైన భార్యయుండ మతిరొక్క దానినిఁ గట్టుకొన్న నాయట్టి చపలుఁడెట్టి నీచమునకైనఁ బాత్రుఁడే.

గీ. అపుడు మీరండ ఱాఘూర్జరావనీశ। ప్రశ్నలకు నుత్తరువులంచు భావిసూచ
కములఁ జూచి నట్లంటిని గాని గుంటఁ। బెట్టి గంటనాయించితి వృద్ధునోట.

మాన—రాజచంద్రమ ! నీకుమారు నక్రమంబుగాఁ జంపబంపితినని వగవవలదు, అది యంతయు నీ కర్మవశము నీతప్పు కాదు. చిత్తశాంతికై పంచమవేదంబగు భారతంబును సాంతముగ వినుము. అది సంస్కృతభాషయం దుండుటచేత సర్వజనగ్రాహ్యము గాకున్నది. కావున నీ నన్నయభట్టారకునిచే నాంధ్రీకరింపఁజేసి త్రిలింగదేశమునకు మహోపకారం బొనరింపుము.

రాజ—ఆర్యా ! శబ్దానుశాసన బిరుదాంకితా !

చ. నిగమము లాగమంబులను నేర్చితి వేర్పడ గాక ధర్మమా
ర్గగతుఁడవైతి నీకు సముఁగానము మానుకృతము చేత ని
న్ను గురునిగాఁగ నోఁచితి మనూన కథామృత పూరభారతం
బొగిఁ దెలిఁగించి మమ్ముఁ బ్రమదోదధిఁ దేల్పవే కొంకనేల్పవే.

నన్న—శా. సాక్షాద్విష్ణుఁడు బాదరాయణుఁడు వాచాప్రౌఢిలోకప్రియా
పేక్షం జేసిన భారతాఖ్యనిగమం బేయాంధ్రమున్ జేయఁగా
దక్షత్వంబును గంటిసేయుయినఁ జేతన్ శక్తియున్నంత
న్మోక్షేచ్ఛన్విరచింతునయ్య భవదామోదాప్తికిన్ భూధవా.

రాజ—(తనలో) ఇంక నా యభీష్టంబు నెరవేరినట్టే కాని నాకుమారుఁడు రాజ్యమేలవలయును. (ప్ర) కుమారా ! సారంగధరా !

ఉ. ఏలితి మేదినీతలము నింద్రుని భంగిని వైభవంబుల
న్జాలఁగ గంటి దేనిపయి నాకిఁకఁ గోరిక గల్గదింతకున్
గాలము చెల్లిపోయెఁగద కాలుని కాకలఁ గాంచకుంటకున్
కూలిభజింప నేగువాశో చొచ్చెదమీఁద ధరిత్రి నేలుమా.

ఉ. మీనలపైని తేనెయని మేదినిసౌఖ్యము లిన్నియుంచు నే
గోసితి దైవమెక్కఁడని రోయుచునుందును నిచ్చలట్టి నా
కీ సుఖరాజ్యమేల ధనమేల గణింతునె వాంతికూటిపై
నాసయొకండుగాంచు జనకా విధి మీ తెలిసంచు నెంచకే.

శాశ్వత బ్రహ్మానంద సౌఖ్యంబువిడిచి తుచ్ఛవిషయసుఖంబు లనుభవించుటకు నామన సొప్పదు. కావున నేనీ మత్స్యనాథుని వెంటనరిగెద.

రాజ—తండ్రీ! విన్న విడువజాలను. యీకట్టుచూచినను నీవొక్కఁడవే పుత్రుఁడవు పితలకు నేఁటితో నివాపనారీయందు నిరాశను జేసెదవా? ఇంతియేగాక.

సీ. పద్రసాన్నము మేము చవులారదినుచుండఁ గందమూలాదులఁ దిందువయ్య
ర—తులలేని పరిగవల్వల మేము గట్టంగ, గాషాయవస్త్రముల్ గట్టుదయ్య
క—ఘనచందనపు బూతలను మేముబూయంగ బూదికాయమునిండఁ బూయుదయ్య
చి—స్వర్ణసౌధములలోపల మేము వసియింపఁ గాంతారమందు వసియింతువయ్య

మంబు—

గీ. మృదులశయ్యాతలంబుల మేము నత్త । మిల్లరానేలపైన త్తమిల్లెదయ్య

రాజ—

అకట మేమట్లు సౌఖ్యంబు లనుభవింపఁ । గష్టపడనీకు వ్రాఁతేమి కాలెనయ్య.

సారం—మీరేల నన్ను నివారింపఁజేసెదరు? నేను బోయెదను.

కన—మనోహరా! మీప్రియురాలి నన్నేమి చేయఁదలంచి యేగుచుంటిరి? నామనవి నంగీకరింపుఁడు.

మంబు—మిత్రమా! మేమును మీతో నడువవలసినవారమే.

నన్న—సారంగధరా! నీజననీ జనకుల ఋణము దీర్చుకొనుము. వారికీయనాథంగ మేల జేసెదవు? జ్ఞానసంపన్నుఁడై రాజ్యముఁజేసిన జనకుని నెఱుఁగవా? నామాటవిని నిటనుండుము.

మీన—సారంగధరా! ఈవన్నుయభట్టారకుని వచనము పెడచెవిఁ బెట్టఁదగినది కాదు. నీకవశ్యంబుగాఁ గర్తవ్యము నేనును వీరి యభిప్రాయముతో నేకీభవించితాను. నీవిచ్చట నుండుము.

సారం—అయ్యా! మీయాజ్ఞను విడువజాలను మిమ్ము నంతకుమున్నే విడువజాలను.

గీ. పంచభూతాత్మకంబయి పరగుదేహ । మిచ్చినట్టి జనకుకంటె నెలమి జ్ఞాన
విద్యనిచ్చిన మీ కిసాకాద్యులౌట । నేమి సేయుటకును దోఁప దేమి సేతు.

మీన—తోఁచకేమి? నీయిచ్ఛవచ్చినప్పుడు నన్ను సందర్శించినఁ జెచ్చెర వచ్చెదను. రాజ్యంబును బూజ్యంబుగాఁ బరిపాలింపుము. ఇందులకుఁ దప్పిన గురుపాదంబులం దప్పినట్లేసుమీ రాజా! నీకుమారునకుఁ బట్టాభిషేక మహోత్సవ మొనరింపుము. నేను వీక్షించి పోయెదను.

రాజ—చిత్తము మహాత్మా!

మీన—ఈసమయమున మీయభీష్టములు వేఁడుఁడు తప్పకొసంగెదను.

రాజ—మీకరుణ పరిపూర్ణముగా మాయందుండఁ గొఱంత గోరంతయును లేదు. అయినను నిట్లు దయసేయుఁడు.

చ. స్థవిరుఁడు ప్రాయమునంగనిన చానను జేకొనకుండుఁ గాత

చిత్రాం— ధ

ర్తవిపిచి యాన్యనింగలియ దాకలుగోరక యుండ్రుగాత

సారం— శా

స్త్రవులకునైన నిందలు వృధాతలఁపైఁ బడకుండుఁ గాత

సుబు— భా

గ్యవశమునఁ జేతఁ బాపము డుగఁటుచుఁ బుణ్యమె నిల్చుఁ గావుతన్.

మీన—అట్లొసఁగితిని. (అందఱు నిష్క్రమించుచున్నారు)

గద్య—ఇది శ్రీ అష్టావధాని విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వర ప్రణీత
సారంగధర నాటకమునందలి
సప్తమాంకము సంపూర్ణము.

# 12 నవలల ఏకబయిండు

ఇందు చక్కని చిన్ననవలలు కలవు. సాంఘికస్థితులు అచ్చున బొడిచినట్లు వర్ణింపఁబడినవి. ఈ చిన్ననవలలు వేఱు వేఱుగాఁ గొనినయెడల "నవల 1 కి ఒకఅణా" నియ్యవలసి యుండును.

న వ ల ల వి వ ర ము.

1 కర్మానుభవము
2 సమిష్టికుటుంబసౌఖ్యము
3 వివాహప్రమాణము
4 మనపద్ధతుల నితరు లెట్లు భావించుచున్నారు
5 వింతమార్పు
6 నన్ను క్షమించి నాసంగతి మఱచిపొమ్ము
7 మూర్ఖుల ప్రతిక్రియ
8 విద్యావతి
9 పిశాచవరుఁడు
10 వరాన్వేషణము
11 పుక్కిటి పురాణము కాదు యాథార్థకథనము
12 అపాయకరమగు మూఁడుచక్రముల బండి

వెల 8 అణాలుమాత్రమే.

కోనంశెట్టి శేషగిరిరావు,
బుక్కుసెల్లరు, ఏలూరు, కృష్ణాజిల్లా.

# వెలకుదొరకు గ్రంథములు

| | |
|---|---|
| గయోపాఖ్యానం | 0-10-0 |
| ప్రసన్నయాదవం | 0-8-0 |
| పారిజాతాపహరణం | 0-8-0 |
| పాండవాజ్ఞాతవాసం | 0-8-0 |
| రోహిణీసుధాకరవిజయం | 0-12-0 |
| గులాబకావళీ నాటకం | 0-12-0 |
| జగచ్చంద్రశేఖరవిజయం | 0-12-0 |
| జయంతజయపాలం | 0-8-0 |
| హాస్యపుపాటలు | 0-6-0 |
| చిత్రనళీయం పెద్దది | 1-8-0 |
| నాగకాంతనాటకం | 0-8-0 |
| ప్రచండరాఘవం | 0-8-0 |
| హస్తినాపురం | 0-8-0 |
| చతురచంద్రహాసం | 0-8-0 |
| అభిజ్ఞానశాకుంతలం | 1-0-0 |
| వేణీసంహారం | 1-0-0 |
| అనర్ఘరాఘవం | 0-8-0 |
| మల్లికామారుతం | 0-12-0 |
| బొబ్బిలియుద్ధము | 1-0-0 |
| వరూధినీవిలాసము | 0-12-0 |
| ప్రహ్లాద | 0-12-0 |
| సన్మద్రాపురుకుత్సీయం | 0-12-0 |
| పాండవజననం | 0-12-0 |
| పాండవప్రవాసం | 0-12-0 |
| పాండవవిజయం | 0-12-0 |
| పాండవాశ్వమేధం | 0-12-0 |
| సుగుణమణి | 0-12-0 |
| సంగీతశశిరేఖ | 0-8-0 |
| చంద్రకాంత సాంగ్సుతో | 0-10-0 |
| విజయబొబ్బిలి | 0-12-0 |
| శ్రీరామవిజయం | 0-8-0 |
| శ్రీరామప్రవాసం | 0-8-0 |
| శ్రీరామజననం | 0-8-0 |
| శ్రీరామోద్యోగం | 0-8-0 |

## బి. బాలాజీదాసుగారి హరికథలు.

| | |
|---|---|
| హరిశ్చంద్ర | 0-6-0 |
| పూర్వహరిశ్చంద్ర | 0-5-0 |
| ప్రియంవదచరిత్ర | 0-6-0 |
| నలచరిత్ర | 0-8-0 |
| సీతాకళ్యాణము | 0-8-0 |
| జయప్రదచరిత్ర | 0-8-0 |
| గయోపాఖ్యానము | 0-8-0 |
| ద్రౌపదీమానసంరక్షణ | 0-6-0 |
| జ్ఞానందదాయిని | 0-4-0 |
| ఏకాదశీమహాత్మ్యము | 0-8-0 |
| సారంగధర | 0-6-0 |
| అంబరీషోపాఖ్యానము | 0-4-0 |
| ప్రహ్లాద | 0-4-0 |
| కబీరుదాసుచరిత్రము | 1-0-0 |

వెలయువారు:—

కొసంశెట్టి శేషగిరిరావు అండు బ్రదర్సు,

బుక్ సెల్లర్సు, ఏలూరు-కృష్ణాజిల్లా.

